# నిజరూపాలు

(సాంఘిక నాటకము)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్స్
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# నిజరూపాలు

ఒక సామాన్య సంసారంలో తండ్రి కొడుకుమీద, కొడుకు తండ్రి మీద, తన చెల్లెలిమీద చూపే అపేక్షలు ఒకవిధంగా వుంటాయి. అవ్వే అపేక్షలు. సౌభాగ్యవంతమైన కుటుంబంలో మరింత ఎక్కువగా ఉంటాయి. అవ్వే అపేక్షలు. దరిద్రకుటుంబంలో కనిపించకుండాపోతాయి. ఈఅపేక్షలు మనిషి సంస్కృతిమీదకంటే ఆర్థికపరిస్థితులమీద ఆధారపడి ఉంటాయని నా అభిప్రాయం. ఈ మనఃప్రవృత్తి ప్రతివాళ్ళూ అనుభవించేదే. ఉదాహరణకు, భర్త జేబులో డబ్బున్నప్పుడు భార్య ఏదన్నా అభిలషిస్తే అనే మాట వేరూ. డబ్బు లేనప్పుడు ఆ భర్త అనే మాట వేరు. ఈ నాటకం ఆ మనఃప్రవృత్తుల్ని చిత్రిస్తుంది- మాధవం, కోదండం ఈ మనఃప్రవృత్తులు గల సామాన్యులు. పరంధామయ్య బ్రతకనేర్చినవాడు. బీదరికం, గొప్పతనం అతన్నేం కదలించవు. బీదరికాన్నే తన కనుకూలంగా మార్చుకోగలడు. రాజ్యం, కనకం - యిద్దరూ ప్రేమికులు, ప్రేమకోసం ఏకష్టాన్నైనా పడగలరు.

అన్ని సన్నివేశాలనూ ఒక రంగంలోకి తీసుకురావాలనే అభిప్రాయం యీ నాటకాన్ని కొంతవరకూ కుంచింపజేసింది.

అన్ని పాత్రలూ బాగానే అర్థమవుతాయిగాని మాధవం - శ్యామలా పాత్రల నర్థం చేసుకోవటం కొంతవరకూ కష్టంగా ఉందని చాలామంది అన్నారు. శ్యామల పొరుగింటి అమ్మాయి, మాధవం ప్రియురాలు. మాధవాన్ని తన తియ్యని మాటల్తో మనసుకోచూరగొన్నది. తీరా మాధవం ఆమె కోసం తండ్రిని గూడా తరిమివేసి శ్యామలను తన యింటికి రమ్మని పిల్చినపుడు శ్యామల ఎదురుతిరిగింది. మాధవంలో ఉన్న స్వార్థాన్ని గ్రహించి అతన్ని త్యజించింది. ఈ శ్యామలను రూపొందిన మాధవపు స్వార్థంక్రింద కూడా అర్థం చేసుకోవచ్చు. స్వార్థం చెప్పే మాటలు ఎప్పుడూ తియ్యగానే ఉంటాయి. స్వార్థం చెప్పే మాటలు కూడా ఆదర్శప్రాయంగా నడుచుకొనగల్గిన పరిస్థితుల్లో రుచించవు. మానవ మానసిక ప్రవృత్తికి పరీక్ష - కష్టసమయాల్లోనే గనక - మానవు డెంతవరకు కష్టపరిస్థితుల్లో ఆదర్శాలు నిల

బెట్టుకోగల్గుతాడనేది ప్రశ్న. కష్టాలలో మానవు డెంత నీచానికైనా సిద్ధ పడ్తాడు; మానవ ప్రకృతి రాక్షస ప్రకృతిగా మారిపోతుంది. మారిపోయిన తర్వాత ఈ స్వార్థమే ఎదురుతిరిగి, వెక్కిరిస్తుంది. దాన్నే పశ్చాత్తాపం అందాం. మంచిగా ఉండాలనే కోరికా, ఆదర్శప్రాయంగా జీవితం గడపా లనే కోరికా గూడా స్వార్థమే గదా? శ్యామలను మాధవంయొక్క స్వార్థపు చిత్రణే - శ్యామల పాత్రగా కూడా తీసుకోవచ్చు. మాధవాన్ని గురించి మరో విషయం తెల్సుకోవాలి. మాధవం సహజంగా. మధ్యతరగతి ప్రజల్లాగా, ఆదర్శప్రాయంగా ఉండాలనే కోరుతాడు. సహృదయం, కవిహృదయం గలవాడు కొంతవరకు కళారాధకుడు కూడా. కనకనే చివరకు కూడ తన పరిణామానికి బాధపడ్తాడు. కారణాలు చెప్పుకుంటాడు. కోదండానికి అబాధ లేదు. రాజ్యం, కనకం పాత్రలు తేలిగ్గానే అర్థమవుతాయి. అయితే అందరి ప్రేమికుల్లాగా గుడ్డివాళ్లు కారు. తతిమ్మా నాటకాలలో నాయకుల్లాగా కాకుండా - తాము కృషిచేసి సాధించదల్చుకున్నదాన్ని సాధిస్తారు.

పరంధామయ్య పాత్ర స్వార్థాన్ని కరిగి మూనపోసిన ముద్ద. మాధవం మనసు పరంధామయ్య మాటలవల్ల ఘనీభవించింది. పరిణామం పొందింది.

పరంధామయ్యలాటి పాత్రలు ఇతర నాటకాలలో వచ్చాయో రాలేదో గాని ఇటువంటి పాత్రలచేత అనిపించిన మాటలు నా భావాలుగా ఉదహ రిస్తూ ఒక విమర్శన 'నాబాబు' నాటకం విషయంలో ప్రచురింపబడినది. అందువల్ల ఈ చిన్ని విషయంగూడా నేను వ్రాసుకోవల్సివస్తోంది. ఒక వ్యక్తి మానసిక ప్రవృత్తి - "క్లిష్టపరిస్థితిలోగాని బయట పడవన్నది" సామాన్యంగా అందరికీ తెల్సిందే. ఆ ప్రవృత్తుల నిజరూపమే ఈ నాటకాంతాన వెలికి వచ్చాయి. అంతేకాక ఆర్థికదుస్థితి మనిషి ప్రకృతి నెంతవరకు ఈడ్చుకు పోతుందో కూడా చిత్రించాను. ఇటువంటి నాటకాలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయి. సహృదయంతో దీన్ని విమర్శించి ఆదరించమని రసహృదయానికి విన్నవించుకుంటున్నాను.

ప్రదర్శన మామూలు ఔత్సాహిక సంఘాలకు సులభసాధ్యం కాదు. మన రంగస్థలాలు కావల్సినంత విశాలంగా కూడా లేవు గనుక, తోట, గోతులు మొదలైనవాటి నన్నిటినీ ఏర్పరచటం కష్టం. అందువల్ల వ్రాయటం

మానితే అభివృద్ధే కుంటుపడ్తుంది గదా! కొద్దిగా డబ్బు కూడా వెచ్చించగల సంఘాలకు ఈ నాటకం అనుకూలంగా ఉంటుంది. ఔత్సాహిక సంఘాలు డబ్బులేని పరిస్థితులలో గూడా ఖర్చు చేస్తూనే యున్నవి. ఏదో నూతనత్వం చూపించాలనే ఆతృతలో Spot Lights గూడ సొంతంగా తయారుచేసుకున్న సంఘాలను నే నెరుగుదును. ఆ కృషి యిటు మళ్లించి, కాగితాలతో Set తయారుచేసుకున్నా ఈ నాటకం ప్రదర్శించగలరు.

శ్యామల పాత్రను మనిషిగానే చిత్రిస్తూ ప్రదర్శన యివ్వాలి. దానిలో గల విశిష్టత అర్థం చేసుకోగల్గినవారే అర్థం చేసుకుంటారు. అర్థం కాక పోయినా, కథ నర్థం చేసుకోటానికి అది అడ్డం రాదు.

ఈ నాటకాన్ని ధైర్యంచేసి శ్రమపడి ప్రథమ పర్యాయం ప్రదర్శించిన రాఘవ కళాసమితి రాజమండ్రివారికి, కళావని బాపట్లవారికి నా అభివందనాలు.

గంగాధరరావు.

# పాత్రలు

కోదండం—సామాన్య కుటుంబీకుడు.

పరంధామయ్య—కోదండం చెల్లెలి భర్త

మాధవం—కోదండం కొడుకు.

కనకం—పరంధామయ్య కొడుకు.

పెళ్లిపెద్ద<br>పెళ్లికొడుకు } పెళ్లిచూపులకు వచ్చినవారు.

సేవకుడు.

పోస్టు బంట్రోతు.

రాజ్యం—కోదండం కూతురు.

శ్యామల—కోదండంగారి ప్రక్కయింటి అమ్మాయి.

ఈ నాటకం ప్రథమ పర్యాయం బాపట్ల కల్చరల్ క్లబ్ వారిచేతనూ తర్వాత రాజమండ్రి రాఘవ కళాసమితివారిచేతనూ చక్కగా ప్రదర్శింపబడింది.

# నిజరూపాలు

## మొదటి రంగము

[ఒక సామాన్యపు కుటుంబపు ఇంటి ఆవరణ. ఎడమ వైపు ఇంటివెనుక భాగాన్ని అంటుకుని వున్న వరండా కనిపిస్తుంటుంది. ఇంటిముందు రెండవ ప్రక్కన వున్న గోడలు, కనిపిస్తుంటయ్. గోడముందు తోట, గోడవెనక చెట్లు కనిపిస్తుంటయ్. ఈ చిన్న తోట మధ్యలో వక సిమెంటు సోఫా కూడా వుంది.

తెర ఎత్తేసరికి మాధవం 22 ఏళ్ళవాడు, వరండాలో Camera తో Photo తీయబోతుంటాడు. అంతలో దూరాన్నించి, సన్నని స్వరంలో పాట వినిపించి మాధవం ఆగుతాడు.

పాట వింటూ, నవ్వుకుంటూ, గోడ దగ్గరగా వెళ్ళి "శ్యామలా, శ్యామలా" అని పిలుస్తాడు. పాట సాగుతూనే వుంటుంది. సిమెంటు సోఫామీద కెక్కి గోడవతలకి చూస్తూ తిరిగి పిలుస్తాడు.]

మాధ—శ్యామలా - శ్యామలా

(శ్యామల గోడ వెనుకనించి యెక్కి కన్పిస్తూ)

శ్యామ—ఆ.

మాధ—ఎవరో కోకిల మీ పూదోటలో చిరుచిందులు తొక్కుతూ కలనాదాల వెదజల్లుతోంది. ఎందుకని?

శ్యామ—ప్రియాగమనం కోసం వెత చెందింనిగాబోలు.

మాధ—(నవ్వి) సరోజాలకంటే ముందుగా యివ్వాళ నీము ఖాబ్జమే వికసించిందేం?

శ్యామ—అంటే?

మాధ—పూర్వాద్రి శిఖరాన భానుబింబంకంటె అరుణో త్కృష్టమయిన మధురోష్ఠి దివ్య దర్శనమయిం దివ్వాళ.

శ్యామ—అహ్హా!

మాధ—"సూర్యోదయానంతరంగూడ చంద్రబింబానికింత కాంతి యెక్కడిదా" అని సందేహం కలిగింది. తీరా చూస్తే అది నీ ముఖబింబం!

శ్యామ—అబ్బో!

మాధ—పరమోత్సాహంతో పరవళ్ళు తొక్కుతున్నావ్. విశేష మేమన్నా వుందా యివ్వాళ?

శ్యామ—మరేమీ లేదు. ఎడబాటు తరువాత కలిగిన తడ బాటు అంతే

మాధ—ఎడబాటెప్పుడు కలిగింది?

శ్యామ—చంద్రోదయాస్తమానాలమధ్య నీ సందర్శన భాగ్యానికే నోచుకోలేదుగా!

మాధ—శ్యామలా - ఈ సూర్యోదయ చంద్రోదయాలతో వెతబాటింకెన్నాళ్ళో మనకు?

శ్యామ—ఈ రెక్కలు విచ్చుకుని ఎగిరివెళ్ళి ఆచుక్కల్లో కలిసి వక్కటైపోయిన తరువాత.

మాధ—అంటే...?

శ్యామ—అంటే – అదిగో – మీ చెల్లెలు–బావ–వస్తున్నారు. వాళ్ళ దోవన వాళ్ళు వెళ్ళిన తరువాత...(శ్యామల గోడ దిగిపోతుంది)

[రాజ్యం కనకం పరుగెత్తు కొస్తారు. రాజ్యం చేతిలో పూలదండ వుంది. దాని కోసం కనకం తరుముతున్నాడు. రాజ్యం అందకుండా ఇంట్లోకి పరుగెత్తుకుపోతుంది. మాధవం వాళ్ళను చూసి నవ్వి ఏదో ఆలోచించి, వసారా దగ్గర కెళ్ళి]

మాధ—(వరండా దగ్గర కెళ్ళి "రాజ్యం" అని పిలుస్తాడు)

రాజ్యం—(వచ్చి) యెందుకురా అన్నయ్యా ?

మాధ—అట్లా కూర్చో. (కూర్చోబెట్టి మళ్ళా వసారా దగ్గరకు పోయి) కనకం –

కన—(వచ్చి) యేరా బావా !

మాధ—అట్లా కూర్చో. ఇద్దరూ నే చెప్పేది సావధానంగ వినండి. ముందు మీకాశ్చర్యంగా వింతగా వుంటుంది – ఇదేమిటూ అనిపిస్తుంది ? కాని, దూరం ఆలోచిస్తే, నే చేసే పనిలో అంతరార్థం అర్థ మవుతుంది.

కన—ఉపోద్ఘాతం సరేలే – అసలు సంగతేమిటి?

మాధ—అలా తేలిగ్గా తోసెయ్యకు. నేను ఆరుగంటలసేపు తల బద్దలుకొట్టుకుని తేల్చాను. ఆఁ. ఇవ్వాళ * తిథి ఆఁ....సంవత్సరం, నెల......వారం...5½ గంటలకు మీ ఇద్దరి వివాహం అయింది.

* ప్రదర్శనమునాటి తిథి, వారములు చెప్పవచ్చు.

రాజ్యం——పెళ్ళా!

కన——ఎప్పుడయిందీ?

మాధ——అంటే - యిప్పుడే - అట్లాగే కూర్చోండి - కదల కుండా.

కన——అదేమిట్రా!

మాధ——ఏమిట్రాలేదు - గీమిట్రాలేదు. పెళ్ళి అయింది. అంటే అయింది. అంతే.

కన——కాలేదంటే కాలేదు.

మాధ——కాలేదంటానకి వీల్లేదు. యెవరడ్డొస్తారో చూస్తాను.

రాజ్యం——యేమిట్రా అన్నయ్యా - యీ వేళాకోళం?

మాధ——వేళాకోళ మేముంది. మీ యిద్దరూ మేనత్త మేన మామ బిడ్డలు. ఈడూజోడూ సరిపోయింది. మనసులూ కలిశాయి - అనువైన సంబంధం - ఇక తక్కిన హడా వుడు లెందుకు, అటు రెండు వేలూ యిటు రెండు వేలు ఖర్చులూ. - పిచ్చి పిచ్చి మంత్రాలూ, చాదస్తపు వేడు కలూ ఎందుకూ? - ఏం? ఇట్లా చేస్తే పెళ్ళికాదా?

న——ఎల్లాగయినా పెళ్ళే లే.

మాధ——కావాలంటే నాకిష్టం లేకపోయినా వప్పుకుంటాను. యీ దండలు వేసుకోండి.

రాజ్యం——ఇదికూడానా?

మాధ——ఇదికూడా. ఏం? ఎవరు కాదంటారు - మీ యిద్ద రికీ యిష్టమైతే...?

కన—ముందు మీా నాన్నే కాదంటాడు.

మాధ—అనడు.

కన—అంటాడు.

రాజ్యం—అంటాడు లేరా.

మాధ—అంతే ఆ సంగతి నే చూస్తాలే. ఆయన్ని వప్పిస్తాగా.

కన—అయన్ని వప్పిస్తావ్ సరే - మరి - మా నాన్ననో

మాధ—ఆయన వప్పుకోడంటావా ?

కన—ఏమో! అది ఒడిగి తేల్చుకోవాలిమరి.

మాధ—యెవరు వప్పుకోకపోయినా ఇది జరిగితీరాల్సిందే - దండలు వేసుకోండి ముందు.

కన—ఊఁ - పట్టవే రాజ్యం! వాణ్ణి చూస్తే కొట్టేట్టున్నాడు.

రాజ్యం—పోరా. అన్నయ్యా, ఇంకా చిన్నపిల్లలమా - యీా ఆటలకి?

మాధ—ఆటకాదు రాజ్యం - దండవెయ్యి. ఇదిగో Photo కూడ తీస్తున్నా. (Camera తీస్తాడు)

రాజ్యం—ఇదొకటా !

కన—అదెందుకూ !

మాధ—ఈ పెళ్ళికి Proof. ఊఁ—రాజ్యం, దండవెయ్యి.

రాజ్యం—అబ్బ - ఏమిట్రా మొండితనం? (సిగ్గుపడుతుంది)

మాధ—మొండితనం లేదు - గిండితనం లేదు - దండవెయ్యి

[రాజ్యం దండ వెయ్యబోతుండగా Photo తీయబోతాడు. దండ వెయ్యకముందే మాధవం తండ్రి కోదండం వస్తాడు]

కోదం—ఏమిట్రోయ్ ఏ చేస్తున్నా దిక్కడ చేరి.

(రాజ్యం సిగ్గుతో పరుగెత్తింది.)

కన—ఏం లేదు మామయ్యా...

కోదం—దండ వేసుకుంటూ, Photo లు తీసుకుంటున్నా రేమిటి.

మాధ—ఏం లేదు - వీళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటున్నారు.

కోదం—పెళ్ళా !

మాధ—ఆఁ. పెళ్ళే, వాళ్ళిద్దరూ వప్పుకున్నారు; నే చేస్తున్నా...

కోదం—అదేమిటి ! వేళాకోళం ?

మాధ—వేళాకోళంకాదు - నిజమే.

కోదం—ఎవర్నీ అడగకుండా, యెవరికీ చెప్పకుండా.

మాధ—ఎవరికి చెప్పాలి - ఎవరొద్దంటారు?

కోదం—నేను...

మాధ—వాళ్ళిద్దరికి ఇష్టమయితే వద్దనటానికి నువ్వెవరు?

కోదం—వాళ్ళిద్దరికీ ఇష్టమయితేమాత్రం-చెయ్యటానికి నువ్వెవరు? పెళ్ళంటె వాళ్ళిద్దరూ వప్పుకుని, నువ్వు Photo తియ్యంగానే సరిపోయిందనుకున్నావా? వాళ్ళ నాన్న వప్పుకోవద్దూ ముందు - వాళ్ళనాన్న లక్షాధికారి. ఆయన చూపెంతవరకుందో, ఆశ యెంతవరకుందో - అంతా చూడద్దూ? అంత తేలికైతే ఇంకేం బాగానే వుంటుంది.

కన—ఉత్తరిక్తే త్వమాషాలే - మామయ్యా..

కోదం — తమాషాయేలే - మీనాన్న వస్తున్నాట్ట - యీ పూట.

కన — అహా - ఎవరు చెప్పారు?

కోదం — రెడ్డెమ్మ చెప్పాడు. దోవలో కనిపించాడట. యింటి దగ్గరే వుంటావుగా?

కన — ఆ. (రాజ్యం తొంగిచూస్తుంది) ఆట అయిపోయిం దిలే - రా.

కోదం — అంతా ఆటగానే వుంటుం దిప్పుడు. (నవ్వుతూ వెళతాడు.)

కన — చూశావా? అంతా మనిష్టం అనుకున్నాం; ఎంతో తేలికనుకున్నాం - ఇదీ లోకమోయ్ - లోకం...

మాధ — లోకంలేదూ గీకంలేదు. ఈసారి ఎవరడ్డొస్తారో - చూస్తాగా. (వెళ్ళాడు)

కన — ఏమే రాజ్యం; మీ అన్నయ్య మనపెళ్ళయితేనేగాని వదిలేట్టులేదు.

రాజ్యం — ఊఁ - పోదూ. ఏంపెళ్ళి!

కన — అలా అంటే ఎలా 'ఎవడడ్డొస్తాడో చూస్తాగా' అంటాడు - అదేదో సినిమాలో అన్నట్లు...!

రాజ్యం — ఏమి ఎవరడ్డొస్తాగో. మానాన్నే అడ్డురాకపోతే యిప్పుడయ్యేదే - పెళ్ళి.

కన — అయితే మీనాన్నే అడ్డొస్తాడు కాబోలు.

రాజ్యం — లేదా - మీనాన్న రావచ్చు.

కన—మా నా న్నెందుకడ్డొస్తాడు? రాడు.

రాజ్యం—రాకపోతే సరే. బాగానే వుంటుంది. వస్తే సం
గతి......?

కన—రాకపోతే అంత - బాగుంటుందేం...

రాజ్యం—పో - బావా - వేళాకోళం (లోపల పాట వకటి
వినిపిస్తుంది)

కన—అదెవరు!

రాజ్యం—ఆ పాడేదేనా ?

కన—ఆఁ!

రాజ్యం—అవతల యింటి అమ్మాయిలే - శ్యామల...

కన—ఆ అమ్మాయా!!

రాజ్యం—తెలీదూ - రోజూ యిక్కడ జేరి పాటపాడుతుంది?

కన—రోజూపాడేది ఈ అమ్మాయేనా?

రాజ్యం—ఆఁ. ఏం?

కన—ఏం లే...

(కోదండంగారు వెనక్కి తిరిగివచ్చి)

కోదం—రాజ్యం - ఏంచేస్తున్నావేయిక్కడ? పో - పోయి-
ఆ సిల్కుచీర, నల్లఅంచుది కట్టుకో - పువ్వులుకొనుక్కో-
పోయావ్? - ప్రొద్దున అమ్మేవాడు యిటురాలే? - అన్నీ
చెప్పాలమ్మా నీకు? - పో-తొందరగా- మళ్ళీ మామయ్య
వస్తాడు.

రాజ్య—మామయ్య వస్తే ఏం?

కోదం — ఏం ఏమిటీ!! – కాబోయే కోడలివి–కాస్త కంటికి నదరుగా కన్పించద్దూ.

రాజ్యం—పో – నాన్నా!

కోదం—అదేమిటే పిచ్చిదానా...మీ అమ్మవుంటే యీ పాటికి ఎంతగా సింగారించేదీ!

కన—ఇంతకూ సింగారించటం ఎందుకు మామయ్యా?

కోదం—ఎందు కేమిటి? – ఇవ్వాళ సంగతి తేల్చటానికే.

కన—ఇవ్వాళా!! అంటే?

కోదం—అంటే మీ పెళ్ళి సెటిల్ చెయ్యటానికి (వెళ్ళాడు కోదండం)

(కనకం వెళ్ళి దూరంగా కూర్చుంటాడు. రాజ్యం సిగ్గుతో అటే చూస్తుంది. ఇద్దరి చూపులూ కలుస్తాయ్. సిగ్గుతో రాజ్యం వెళ్ళిపోబోగా)

కన—ఆగు...

రాజ్యం—(ఆగింది)

కన—ఇట్లా రా.

రాజ్యం—(రాదు)

కన—రమ్మని నిన్నే – అనేది

రాజ్యం—(రాదు)

కన—రమ్మని నీకు కాదూ చెప్పటం?

రాజ్యం—(దగ్గరకొచ్చింది)

కన—(అధికారయుతమైన స్వరంతో) ఇట్లా కూర్చో.

రాజ్యం—(కూర్చోదు)
కన—(గట్టిగా) కూర్చో.
రాజ్యం—(కూర్చుంది)
కన—తెలిసిందా!
రాజ్యం—(తెలిసినట్లు తలవూపింది)
కన—ఏమని?
రాజ్యం—(ఏమని అన్న ప్రశ్న వేశినట్టు తలవూపింది)
కన—మీ నాన్న అన్నమాట తెలీలా? ఇవ్వాళ మన పెళ్ళి స్థిరపరుస్తారు. ఇక నుంచి నువ్వు - నా - నా పెళ్లానివి, నే చెప్పినట్లు వినాలి; చెప్పినట్లు నడుచుకోవాలి; చెప్పినట్లు చెయ్యాలి, తెలిశిందా - మొగుడంటే యేమిటో?
రాజ్యం—తెలిసింది.
కన—ఏమని?
రాజ్యం—చీపురు పుల్లని నువ్వే పెళ్ళికొడుకంటె రకాలు మని లేచి నుంచుందట (అని పరుగెత్తుతుండగా)
కన—రాజ్యం - రాజ్యం - ఆగు.

(రాజ్యం వెళ్ళి పోయింది. కనకం నిరాశగా పచార్లు చేస్తుండగా, ఒక మొగలిరేకు కట్టిన రాయివచ్చి కనకం ముందు పడుతుంది. తీసి పరీక్షించి - మొగలిరేకుమీద అక్షరాలు చదువుతాడు "ప్రేమతో" అని)

కన—ప్రేమతో...రాజ్యం; రాజ్యం (పిలిచాడు కాని కోదండం వచ్చి)

కోదం—(వచ్చి) ఎందుకూ రాజ్యం?

కన—ఏం లే. . . ఏం లే. . .

కోదం—ఏమన్నావ్ దాన్ని? – దానికి కోపం వచ్చినట్లుంది.

కన—ఏం అనలేదే.

కోదం—ఆ చేతిలో దేమిటి ?

కనం—ఏం లే (దాస్తూ)

కోదం—అహా! ఏదో మొగలరేకులా వుంది.

కన—అహా. . .

కోదం—ఏదీ (తీసుకుని చదువుతాడు. పరీక్ష చేసి) 'ప్రేమతో! ప్రేమతో!' (దర్వాజా దగ్గర కెళ్ళి) రాజ్యం – రాజ్యం ఇట్లారా – తొందరగా – (రాజ్యం వస్తుంది)

కోదం—ఇదిగో – బావ నీకోసం ఏదో తయారుచేసినట్లు న్నాడు. ఇంద (మొగలిరేకురాయి ఇస్తాడు.)

రాజ్యం—ఏమిటది ?

కోదం—ఏమిటో! నిలవేసి నువ్వే అడుగు (ఇంట్లోకి వెళ్లాడు)

కన—(దూరంగాపోయి కూర్చుంటాడు)

రాజ్యం—(దగ్గర కెళ్ళి) ఏమిటి బావా యిది ?

కన—ఏమొ నాకేం తెల్సు ?

రాజ్యం—సిగ్గులేకుండా – ఏమోట –

కన—నా కెందుకూ – సిగ్గూ ?

రాజ్యం—నీకాకపోతే మరెవరికి? ఏమిటి దీనర్థం?

కన—అది నేను చెయ్యలేదు – నేను ఇయ్యలేదు.

రాజ్యం——మరెవరు చేశారేం ?

కన——ఏమొ - ఆ గోడమీదనుంచి వచ్చి పడింది.

రాజ్యం——ఆ గోడమీద నుంచా !!

కన——ఆc !

రాజ్యం——అయితే ఆ అమ్మాయి రాశి పడేశిందన్నమాట.

కన——ఆc. అది ఆడవాళ్ళ దస్తూరి లాగనే వుంది.

రాజ్యం——ఆc. ఆ అమ్మాయి దస్తూరే - నాకు తెల్సు - ఏం జవాబిస్తావో - ఇయ్యి (మీాద పడేసింది)

కన——అదేమిటి ?

రాజ్యం——ఏముంది? ఆ అమ్మాయి "ప్రేమతో" మొగలి రేకు పంపింది.

కన——ఎవరికి !!

రాజ్యం——మరెవరికి ? - నీకే...

కన——నాకెందుకూ ! - !

రాజ్యం——ఎందుకేమిటి ? ప్రేమతో పంపిస్తే...

కన——ఛీ

రాజ్యం——ఛీ లేదు; ఛా లేదు - నీకే పంపింది.

కన——ఛా...

రాజ్యం——"ఛా" ట 'ఛ'- సిగ్గులేకుండా - (వెళ్ళిపోబోగా)

కన——ఆగు...

రాజ్యం——ఎందుకూ ?

కన——పడేశిందెవరో నే చూడలేదు. కాని - అది ఆడ వాళ్ళు మాత్రం కాదు.

రాజ్యం—నీ కెట్లా తెలుస్.

కన—చెయ్యి గోడమీదనుంచి కన్పించింది. ఆ చేతికి గాజులూ గీజులూ ఏం లేవు.

రాజ్యం—గాజులు లేవ్వూ ?

కన—లేవు. కనక ఆవేశింది మగవాడే...

రాజ్యం—మగవాడా !!

కన—ఆc.

రాజ్యం—అయితే సరే (అని వెళ్ళబోతుంది)

కన—ఆగు,

రాజ్యం—ఇంకెందుకు ?

కన—ముందుమాటలు తూలినందుకు క్షమార్పణ చెప్పాలి. తరువాత......

రాజ్యం—తరువాత ?

కన—తరువాత ఇది నీకే వచ్చింది కనుక - సంజాయిషీ చెప్పాలి.

రాజ్యం—ఇది వచ్చింది - నాకా?

కన—లేక నాకా! మొగవాళ్ళు ఆడవాళ్ళకు వ్రాయక మొగవాళ్ళకు వ్రాస్తారా! ప్రేమతో...

రాజ్యం—అయితే ఇది నాకు ఎవడో రాశాడంటావా ?

కన—అనే అంటాను.

రాజ్యం—ఇది ఎవడో నాకు వ్రాశాడని - నాతో అంటే అన్నావ్ - కాని - మరెవరితో అనక,

కన—ఏం అంటే

రాజ్యం—అంటే నిన్నా - ఆ వేసినవాణ్ణీ, పళ్ళాడ గొడతారు...

కన—ఏడిశారు - ఈ వుత్తరం నీకే అయితే...

రాజ్యం—ఇది నాకు కాదు - రాసింది - మగవాడూ కాదూ-

కన—కాదూ ?

రాజ్యం—కాదు. ఇది రాసింది ఆ యింటి శ్యామల - అన్నయ్య కోసం (పరుగెత్తింది)

కన—(పరుగెత్తేదాన్ని పట్టుకుని లాక్కొచ్చి) అన్నయ్య కోసమా.

రాజ్యం—వూఁ.

కన—నీ కిదివరకే తెల్సా !

రాజ్యం—ఆఁ.

కన—ఎట్లా తెలుసు !

రాజ్యం—ఇలాంటిది నామీఁదా వకసారి వడింది. అన్నయ్య వకసారీ పూలనిచ్చేనమీఁద గోడదాటి వెళ్ళాడు.

కన—నువ్వు చూశావా !

రాజ్యం—ఆ.

కన—అమ్మదొంగా!.....అయితే యిప్పుడేంచేద్దాం.

రాజ్యం—ఏమిటి ?

కన—ఇది మీా అన్నయ్యకిద్దాం...పిలుస్తా.

రాజ్యం—వద్దు.

కన—ఏం ?

రాజ్యం—మనం యిస్తే బావుంటుందా ?

కన—మ రేంచేద్దాం.

రాజ్యం—ఇది ఇక్కడేపడేసి - అన్నయ్యని పిలుద్దాం, మనం వెళ్ళిపోదాం. చూసి తీసుకుంటాడు.

కన—సరే - ఒరే మాధవం, మాధవం ! (కనకం వసారా తలుపుదగ్గరకెళ్ళి పిలుస్తాడు.)

(మాధవం లోపలనుంచీ 'ఆఁ' అని పలికాడు)

కన—ఇట్లారా (వెనక్కి వచ్చి) వస్తున్నాడు - పోదాంపద...

రాజ్యం—అహాఁ, ఇక్కడే దాక్కుందాం, రా.

(ఇద్దరూ పూలపొదచాటున దాక్కుంటారు)

మాధ—(వచ్చి) ఎందుకురా... బావా...ఎక్కడున్నావ్ రా (మొగలిరేకును చూసి ఖంగారుపడి-తీసి దాచేసి, నెమ్మదిగా గోడదగ్గరకెళ్ళి 'శ్యామలా' అని పిలుస్తాడు)

(గోడ అవతలనుండి 'ఆఁ' అని వినిపించింది)

మాధ—(గోడదగ్గరకెళ్ళి అవతలవైపునవున్న శ్యామలనుద్దేశించి) ఏమిటీ మొగలిరేకులమీద ప్రణయ సందేశాలు?

శ్యామ—హృదయతంత్రులమీద వలపు కులుకులు.

మాధ—ఎవరైనా చూస్తే...!

శ్యామ—పొంగిపొరలే పాలమీద ఎన్నాళ్ళని చన్నీళ్లు చల్లుతావ్ ?

మాధ—బాగుంది. అందుకని భావావేశంలో మతి మరచిపోతామా?

శ్యామ—మతి పోతూనేవుంది మమతలోపడి - దానిసంగతి సరే! దర్శనభాగ్యంకూడా నోచుకోలేదా- యీ పూట?
మాధ—ఇప్పుడు రమ్మంటావా యేం?
శ్యామ—వస్తే - అరిగిపోతావా ఏం?
మాధ—ఎట్లారానూ?...ఇక్కడ......ఇక్కడ...
శ్యామ—రోజూ వచ్చేలాగే 'రా. రోజారెక్కలు కట్టుకుని వలపు నిచ్చెనమెట్లు వడి వడిగా ఎక్కి, ఎడబాటు ఎత్తు గోడమీదుగా ఎగిరిరా.
మాధ—రానా! - రానా?...(అంటూ గోడ ఎక్కటానికి ఒకటి రెండుచోట్ల ప్రయత్నంచేసి చివరికి సైడ్‌లోకి వెళ్ళిపోతాడు)

(రాజ్యం కనకం పొదచాటునుండి లేస్తారు)

కన—వెళ్ళాడు...
రాజ్యం—అదిగో - గోడదూకాడు (గోడప్రక్కచేరి పొంచి వుండి - వింటూ)
కన—అదిగో - మాట్లాడుతున్నారు.
రాజ్యం—అదిగో...నవ్వుతున్నారు.
కన—అదిగో........
రాజ్యం—ఏమిటది?
కన—ఏమిటో?
రాజ్యం—ఏం లేదు.
కన—ఏం లేదూ?

రాజ్యం—ఏమీలేదు. (నవ్వుతూ) పద పోదాం వస్తాడేమో.

కన—ఇప్పు డప్పుడే రాడులే.

రాజ్యం—ఏం?

కన—వలపు పందిరిక్రింద-మధురస్మృతుల్లో - మతిపోయి...

రాజ్యం—మతిపోయి...

కన—మతిపోయి మమతలో మరిగిపోయేవాడికి - పదిమంది చూస్తారనే భయమెందు కుంటుంది?

రాజ్యం—నీకూ పోయినట్లుందే!

కన—ఏమిటి?

రాజ్యం—మతి...

కన—ఆఁ. మతెప్పుడో పోయింది. (నవ్వుతూ) నీ కన్నుల నీలిమకాంతుల్లో ఎప్పుడో కరిగిపోయింది.

రాజ్యం—పో బావా - పెళ్ళయినా కాకుండా ఏమిటీ మాటలూ?

కన—మనసులు కలిసిన తరువాత మంత్రాలు అడ్డువస్తాయా. చెప్పు రాజ్యం!...పెళ్ళయిన తరువాత మనంఏంచేద్దాం?

రాజ్యం—ఏం చేస్తాం?

కన—ఏం చేస్తామా! ఆ చిగురాకు చిట్టచివర - చిన్న గూడు కట్టుకుని -మందపవనంతో ఉయ్యాల లూగుదాం.

రాజ్యం—ఉహు! నెలవంక నెలవులో - తెల మబ్బుటంచుల మీద - తేలియాడుతూ సోలిపోదాం.

కన—ఓః; రాజ్యం; నువ్వు నన్ను ప్రేమిస్తున్నావుగా?

రాజ్యం—ఆ.

కన—అయితే చెప్పు ఎట్లా - ఎంతగా ప్రేమిస్తున్నావ్ ?

రాజ్యం—చెప్పనా...నిన్నటికంటె ఎక్కువగా, రేపటికంటె తక్కువగా

కన—రాజ్యం...ఇదేం స్వప్నం కాదుగదా - మనిద్దరం ప్రపంచాన్నే మరచిపోతున్నాం కదూ.

రాజ్యం—నేనూ అదే భయపడుతున్నాను. ఊహాలోకం యిక వదలి - మన లోకంలోనే మామూలుగా జీవిద్దాం.

కన—అంతే - రాధా రమణుల్లాగ, వెలుగు నీడల్లాగ. కన్నూ కనుపాపల్లాగా కలసి మెలసి జీవిద్దాం.

రాజ్యం—అంతకు ముందొక ప్రమాణం చేసుకోవాలి మనం.

కన—ఏమిటది ?

రాజ్యం—మనం వకరికోసం వకరు - కన్నీరు కార్చే పరిస్థితి రానివ్వమని.

కన—ఏమిటి రాజ్యం -ఏం మాట లవ్వి ?

రాజ్యం—హుష్ ! మాట్లాడుతున్నది మనం కాదు. రెండు హృదయాలు. హృదయాలు తలుపులు తెరచుకుని తలపులు ఎగిరిపోతున్నై. స్వచ్ఛమైన మనస్సుల్లోంచి అసత్యాలు వెలికిరావు. చేతిలో చెయ్యి - మనసులో మనసుతో ఎగిరిపోదాం భావాంబర వీధిలో.

కన—నా హృదయం బరువెక్కి పోతోంది.

రాజ్యం—మాట్లాడటానికి మాటలు చాలటం లేదు.

(ఒక్క-క్షణం నిశ్శబ్దం. తరువాత లోపల తలుపులు గట్టిగా తోసిన శబ్దం అయింది)

కన—(త్రుళ్ళిపడి) ఎవరది - మనసు వులికి పడేట్లు అంత గట్టిగా నెట్టారు - తలుపు.

రాజ్యం—ఎవరో ఈ నిశ్శబ్దాన్ని భంగపరచేవాళ్ళు వస్తున్నారు.

కన—(చూసి) ఎవరో కాదు - మా నాన్న...

రాజ్యం—వస్తున్నాడా...?

కన—అదుగో...

(పరంధామయ్యగారు ప్రవేశించి)

పరం—ఇక్క-డున్నారా యిద్దరూ? ఆ తలుపులు అంత వదులుగా వున్నాయేం? ఇట్లా తోశానో లేదో - అంత పెద్ద శబ్దం చేశాయి. మామయ్యేడీ?

కన—పిలవనా! లోప లున్నాడు. మామయ్యా, మామయ్యా (తలుపు దగ్గర కెళ్ళి పిలుస్తాడు)

పరం—ఆఁ - ఆ బండివాడు నీకు తెలుసా?

కన—ఏ బండివాడూ...?

రాజ్యం—ఏం చేశాడేం మామయ్యా?

పరం—వాడు నన్ను చే శేదేమిటి? వాడి మొహం! స్టేషన్ నుంచి యిక్క-డికి రూపాయి అడిగాడు. నేను 'ఉహూ' అన్నా, నేను 'ఉహూ' అన్నా వాడు రూపాయే కావా

లన్నాడు. నీకు తెలుసుగా నేను 'ఉహూ' అంటె 'ఉహూ' యే, 'అహా' అంటె 'అహా' యే అనీ - ఇస్తానన్న అర్ధ రూపాయి నా మొహాన పారేశి వెళ్ళిపోయాడు వాడు. అయినా సరే - 'అహాఁ' యే అన్నాను.

[కోదండం వస్తాడు]

కోదం—ఏ బావగారు. ఎప్పుడూ దిగటం...?

పరం—ఇప్పుడే. గుంటూరు వెళ్లాను - అక్కడనుంచి యిటు వచ్చా. (అని పాతకుర్చీమీద కూర్చోబోతుండగా ఆ కుర్చీలో చిన్న మేకు గుచ్చుకుని - అబ్బా అంటూ బాధ నభినయిస్తాడు)

కోదం—(మంచి కుర్చీ చూపిస్తూ) ఈ కుర్చీలో కూర్చో - బావా ఆ కుర్చీలో కూర్చున్నావేం? ఆ కుర్చీలో మేకుంది.

పరం — ఫరవాలేదులే! యిక్కడ కూర్చున్నాగా. మేకు చిన్నదే.

కోదం—కాదులే బావా. నామాట విని యీకుర్చీలోకూర్చో. ఎంత చెడ్డా సొంత బావగారివి. లేచి ఆ కుర్చీలోకూర్చో. (మంచికూర్చీ చూపిస్తాడు)

పరం—ఊఁ- చెపితే వినవు. (అని లేచి మంచి కుర్చీలో కూర్చుంటాడు)

కోదం—అయితే గుంటూరునుంచే వస్తున్నావన్నమాట?

పరం—ఆఁ, గుంటూరే. వెళ్ళి పదిహేను రోజులయింది. అక్కడో నువ్వోళగట్టుకొంటూ - నాస్నేహితుడొక

డున్నాడులే – ఇన్నాళ్ళూ వాళ్ళింట్లోనే బస. వెళ్ళినపని అయిపోయినా వాళ్ళు వదల్లే. పట్టుబట్టి పది రోజు లుంచారు. 'వుహుఁ' అన్నా వదల్లా, 'అహాఁ' అన్నా వదల్లే – సరేగదా అని వున్నా.

కోదం—ఆఁ– లేవమ్మా రాజ్యం, మామయ్యకి తొందరగా భోజనం చెయ్యటం అలవాటు.

పరం—ఉహుహు – భోజనం, గీజనం – ఏం అఖ్ఖర్లేదు.

కోదం—అదేమిటి!

పరం—అహా! నేను అహాఁ అంటే అహాఁ, వుహుఁ అంటె వుహుయే.

కోదం—సరేలే, పోనీ – ఫలహారమన్నా చెయ్యి.

పరం—ఫలహారానికేంలే...అమ్మాయి రాజ్యం! నా కోసం నువ్వేమీ బాధపడక్కర్లే. కాస్త నేతిలో నాలుగు గారెలు పడెయ్యి, కావాలంటే చక్కెర కేళీలు తెప్పించు కుంటాను.

కోదం—నే తెప్పిస్తాలే– అవ్విగూడ. ఇంతలో ఏం మొహ మాట పడతావ్.

పరం—మాటన్నంతలో నేను కొని తేబోవటం లేదులే.

కోదం—పదమ్మా రాజ్యం – త్వరగా కానీ.

(రాజ్యం లోపలికెళ్ళింది.)

పరం—చూశావ్ కోదండం – మా గుంటూరి స్నేహితు. డున్నాడే! వాడు కాస్త 'ఆస్తి' మస్తుగా వున్నవాడులే ఒక్కత్తే ఆడపిల్ల. మనరాజ్యం ఈడుదే.

కోదం—అహా.

పరం—ఈ పదిరోజులూ ఆ అమ్మాయిని కనిపెట్టిచూశాను. చాలా యోగ్యురాలు. మాటల్లో పొందిక – చేతల్లో చాకచక్యం – మన రాజ్యానికి మల్లే కాకుండా...

కోదం—అహా !

పరం—వాళ్ళీ పదిరోజుల్నించీ నా ప్రాణం తీశారనుకో –

కోదం—అహా !

పరం—ఏమని ?

కోదం—ఏమని – ?

పరం—మన కుర్రాడికి ఆ పిల్లని చేసుకోమని.

కోదం—అహా.

పరం—"ఈడు వచ్చింది, ఇక ఆగటానికి వీల్లేదు, వెంటనే పెళ్ళిచేసేద్దాము"ని......

కోదం—అహా –

పరం—నేను 'అహా' అన్నాను. 'వుహూ' అన్నాను. ఏమన్నా వినరే: నేను వుహూ అంటే వుహూ అని, 'అహా' అంటే 'అహా' అని వాళ్ళకు తెలీదు గొడవ. చివరికి......

కోదం—చివరికి ?

పరం—చివరికి – మొన్న సాయంత్రం మా స్నేహితుడికి – చలిజ్వరం తగిలింది. 104 దాకా పోయింది. ఆజ్వరంలో నన్ను దగ్గర కూర్చోబెట్టుకుని "యీజ్వరంతో నేనెప్పుడో

'హరీ' అంటాను. యిక నీకు తప్పదు'' అని తన ఆస్తినీ-ఆ అమ్మాయినీ నాచేతిలో పెట్టి దణ్ణం పెట్టాడు.

కోదం—అహా. !

పరం—ఇక 'అహా' అనీ 'వుహూ' అనీ ఏం ప్రయోజనం? సరేనని వప్పుకొచ్చాను. దీనికి నువ్వుమాత్రం మరేం అనుకోకు.

కోదం—ఏమీ అనుకోకుండా ఎలా వుంటాను? చిన్నప్పటి నుంచి రాజ్యాన్ని మన కనకాని కిద్దా మనుకుంటున్నాం. ఆసంగతి నీకూ తెల్సిందేగా. నువ్వే యిట్లా అంటే నేనే మన్నా. నువ్వూ, నీకొడుకు ఆలోచించుకుని ఎట్లాచేస్తే బావుంటుందో అట్లాచేయండి.

పరం—అహా హా హా హా - నువ్వలా కోప్పడకు.

కోదం—నాకోప మెందుకు బావా? ఆడపిల్లను కన్నవాడికి కోపంవచ్చి ఏం సాగుతుంది - గనుక. (అని కోదండం లోపలి కెళ్లాడు)

పరం—వుహు హు హు - నువ్వట్లా వెళ్ళిపోతే ఎట్లా?

కన—మామయ్యకు చాలా కోపం వచ్చినట్లుందినాన్నా?

పరం—ఆ...వచ్చింది...కన్పిస్తూనే వుంది.

కన—రాజ్యాన్ని నా కిస్తారని చాలా రోజులబట్టీ అనుకుంటున్నాం.

పరం—అహహా! మీ అమ్మ పోయిందగ్గరనుంచి...

కన—అప్పటినుంచి అనుకుంటున్నది ఇప్పుడు కాదంటే ఏం బావుంటుంది?

పరం—బావుండటమంటే ఎక్కడికి లే!

కన—నాకూ రాజ్యాన్ని చేసుకోవాలనుంది.

పరం—నువ్వామ్మాయివి చూస్తే - ఇంకా ఎక్కువగా వుంటుంది.

కన—నువ్వంత తొందరపడివచ్చుకోవాల్సింది కా దీవిషయం.

పరం—తొందరపడ్డా వచ్చుకున్నానుగా!

కన—నువ్వొచ్చుకున్నా - నేను వచ్చుకోలే.

పరం—నేను వచ్చుకుంది నీకోసమే.

కన—పెళ్ళిచేసుకోవాల్సింది నేను గాబట్టి నేను వచ్చుకోటం లేదని మీ మలేరియాస్నేహితుడితో చెప్పండి.

పరం—అహాహాహా......

కన—అహాహాహా లేదు; ఉహూహూహూ లేదు. నాయిష్టం యింతే. (కనకం వెళ్ళిపోతాడు)

పరం—ఉహుహు......(కాసేపు అహాహా 'ఉహుహు' అంటుంటాడు. రాజ్యం వస్తుంది)

రాజ్యం—ఏమిటి మామయ్యా యిది?

పరం—ఉహుహుహు......

రాజ్యం—బావకి వేరే సంబంధం చూశావా?

పరం—అహాహా......

రాజ్యం—అయితే నన్నే గోతిలో దూకమంటావ్?

పరం—ఉహుహుహు......

రాజ్యం—దూకద్దంటావా! - అయితే బావక్కి ఆ సంబంధం చెయ్యకు.

పరం—అహాహ......

రాజ్యం—ఆ సంబంధం బావకుచేస్తే నా గొంతు చేత్తో నులిమేసినట్లే!

పరం—ఉహుహు!!

[కోదండం వచ్చి]

కోదం—బ్రతిమాలుతున్నావా మామగారిని......?

పరం—అహాహ......

కోదం—ఆయనికి డబ్బే ప్రధానమయింది, ఇంకేం బ్రతిమాల్తావ్?

పరం—ఉహుహు!!

కోదం—ఏమిటీ...అహాహ...ఉహుహు...

పరం—మలేరియా; వణుకు; జ్వరం...అహాహ...

కోదం—అది నీ స్నేహితుడికి వస్తే వచ్చింది?

పరం—నాకే వచ్చింది. అహాహాహాహ

రాజ్యం—నీకా?

పర—ఆ...చూడు. ఉహుహుహు...

రాజ్యం—(చూసి) ఆ – వచ్చింది – వళ్ళు కాలిపోతూవుంది.

పరం—ఉహుహుహు

(రాజ్యం గబగబ లోపలకెళ్ళి రగ్గుతెచ్చి కప్పి దూరంగా నుంచుండ.)

కోదం—కనకాన్ని చిన్నప్పటినుంచి ఇక్కడే వుంచి చదివింపటంలో, నీ వుద్దేశ్యం రాజ్యాన్ని చేసుకొంటానికే

అనుకున్నాను. రాజ్యానికీ పెళ్ళి యీడువచ్చింది ఇప్పుడు. కనకానికి నువ్వు వేరే పెళ్ళి తలపెడితే రాజ్యానికి నేనెక్కడినించి తేను సంబంధం?

పరం—సంబంధాలకేంలే! బోలెడు.

కోదం—నీకు బోలెడు కన్పిస్తాయి బావా! నువ్వంటే చాలా ధనవంతుడివి. ఎవరన్నా యిస్తారు నీకు పిల్లని. కాని నేను సామాన్యుణ్ణి, చాలీచాలకుండ యీ యిద్దరి పిల్లల్ని సాకొస్తున్నాను. నీ కళ్ళద్దాలతో నా పరిస్థితులు చూడకు మరి.

పరం—అందుకని కనకం జీవితాన్ని పాడుచేయమంటావా?- వాడు నీకూ పరాయి వాడు కాదుగా మేనల్లుడేగా! వాడి బాగోగులూ చూడాలిగా?

కోదం—అంటే ఆ సంబంధం ద్వారా వచ్చే ఆస్థి చూడమనేగా- నీ వుద్దేశ్యం? నీకు చుట్టరికం కంటే ఆస్తే ముఖ్యమయిందయితే - సరే.

[కనకం వచ్చాడు]

పరం—చుట్టరికం చూసి వ్యవహారం చెడగొడితే ఎట్లా?

కన—నా పెళ్ళి వ్యవహారం, వ్యాపారం కాదు నాన్నా. ఈ సంబంధానికి నే నొప్పుకోను. ఆ ఆశవదిలెయ్యి.

పర—ఏడిశావులే - పెద్దవాళ్ళం - అన్నీ ఆలోచించేవాళ్ళం- మేము.

కన—మీా పెద్దరికం మీారే వుంచుకోండి.

పరం—వెధవ వాగుడు వాగకు. అహహా

కన—నువ్వు అహహా అన్నా - ఉహుహూ అన్నా - నే నొప్పుకోను.

పరం—ఒప్పుకోకపోతే ఎట్లా - మాట ఇచ్చిం తరువాత.

కన—ఏమో! నాకేలదు కది?

పరం—నా మాట నేను నిలుపుకుతీరాలి!

కన—నిలుపుకోవాలంటే...

పరం—నిలుపుకుంటూ! నిలబెట్టుకు తీరతా - ఏమైనగాని - నే వెళ్తున్నా - బాగా ఆలోచించుకుని రేపు వుత్తరం రాయి.

కన—ఉత్తరం రాయాల్సిన అవసరం నాకేం లేదు. రాస్తే నువ్వే రాయి.

పరం—అయితే సరే - నేనే వుత్తరం రాస్తా - అది బాగా చదివి అర్థం చేసుకో - అప్పుడు రాయాల్సిన అవసరం వస్తుంది. - అప్పుడే రాద్దువుగాని (వెళ్ళబోగా)

కోదం—అదేమిటి? జ్వరం తగ్గాక వెళ్దువుగాని.

పరం—అక్కర్లే! కాస్సేపు అహహా ఉహుహు అంటే అదే తగ్గుతుందిలే (వెళ్ళాడు)

రాజ్యం—ఏమని రాస్తాడో!

కన—ఏం రాస్తాడు. నా ఆస్తి నీ కివ్వనని బెదిరిస్తాడు. ఇక నీకూ నాకూ సంబంధం లేదంటాడు. మామోలేగా.

కోదం—బాగా నేవుంది గొడవ.

కన—నువ్వేం బాధపడకు మామయ్యా!

కోదం—బాధపడకుండా వుంటాను కనకం. రాజ్యాన్ని నువ్వు చేసుకుంటానంటావ్. కాని "ఆస్తి బాగానేవుందీ, - మా రాజ్యం సుఖపడుతుందీ" అని ఆశించాను. కాని యిక ఆ ఆశ నిరాశే అవుతుందిగా?

కన—నీకూ ఆస్తిమీందే ఆశా?

కోదం—ఆస్తిమీంద కాదు నాయనా - పిల్ల సుఖంమీంద!

(కోదండం వెళ్ళాడు)

కన—సుఖం...సుఖం...సుఖం ధనంలోగాని లేదుగాబోలు.

రాజ్యం—బావా!

కన—రాజ్యం...

రాజ్యం—ఏమిటిదంతా?

కన—అదే నేనూ ఆలోచిస్తున్నాను.

రాజ్యం—ఏం జరగాల్సి వుందో-ముందు. బావా! ఇట్లారా. నా దగ్గరగా కూర్చో. నా మనసు మరగిపోతూంది. ఏం అర్థం కావటంలేదు. ఎందుచేత మనిషికీ మనిషికీ యింత భేదం వుంది?

కన—మనిషి తనను గురించి తప్ప - యితరం ఆలోచించ నన్నాళ్ళూ ఇంతే.

రాజ్యం—అయితే మన ఆశ లిలా నేలపాలు కావల్సిందేనా?

[గోడవైపు శబ్దంకాగా ఇద్దరూ అటు చూస్తారు. అటునుంచి మాధవం వస్తాడు]

మాధ——ఓ - మీరిక్కడే వున్నారే! ...ఆ...అల్లాగే కూర్చోండి. ఇందాక Photo తీయనేలేదు; ఒక్కనిమిషం, (అని మాధవం కెమేరాతో Photo తియ్యబోగా దుఃఖం వచ్చి రాజ్యం వెళ్ళిపోతుంది. కనకంకూడ లేచి పోబో తాడు)

మాధ——ఏమిట్రా అది ?

కన——ఏం లేదు.

మాధ——ఏఁవయింది !

కన——ఏం లేదు.

మాధ——ఏం లేకపోతే యీ కన్నీళ్ళెందుకు ?

కన——మా నాన్న వచ్చారు...వచ్చి

మాధ——వచ్చి ?

[లోపలనుంచి కోదండం గబగబా వచ్చి]

కోదం——వచ్చాడు. వస్తూ కనకానికి వేరే సంబంధం తెచ్చాడు. ఆ సంబంధం చేసుకుంటే బోలెడంత ఆస్తి వస్తుందట. ఆ సంబంధం చేసుకోకపోతే జాగ్రత్త అని బెదిరించి వెళ్ళాడు.

మాధ——అంటే ?

కోదం——అంటే ఇక ఆయన ఆస్తితో వీడికేమీ సంబంధం లేదన్నమాట. వీడుకూడా నా నెత్తినెక్కి కూర్చోవా లన్నమాట. ఇక మీ ముగ్గురినీ నేనే భరించి – మెయ్య లేక, చావాలన్నమాట. అంతటితో అందరం వట్టి దరి ద్రులమైపోయి, మట్టిగొట్టుకు పోవాలన్నమాట.

మాధ—అట్లా నొందుకనుకోవాలి?

కోదం—కాక మరేం అనుకోను? మీా ముగ్గుర్ని పోషించటానికి నే నెక్కడినుంచి తేను డబ్బు. "రాజ్యం పెళ్ళి విషయంలో అంతా తేలిపోయిందిగదా-నీచదువు పూర్తి చేయించి పైకితీసుకొొచ్చి, పెళ్ళిచేస్తే, వకమాదిరి పరువుగానన్నా బ్రతకగలంకదా" అనుకున్నాను. ఉన్నది కాస్తా యీా ఖర్చులకేసరిపో తే తరువాత రెక్కాడితేనేగా డొక్కాడటం. ఛీ...ఛీ! ఇంత నీచానికి దిగుతా ననుకోలేదు.

మాధ—నువ్వు వద్దని చెప్పకావేరా?

కోదం—ఆ. చెప్పాడు. ఉన్నాడుగా మామయ్య! గాడిదలాగ అన్నింటినీ మొయ్యటానికి. వాడిదేంపోయింది - వద్దనేశాడు.

కన—మామయ్యా!

మాధ—కనకం!!

కోదం—ఏం అంతకోపం! చేసింది చాలదూ!

కన—నేను నీకు బరువవుతున్నాననే ఆలోచన నాకులేదు మామయ్యా! రాజ్యాన్ని తప్ప వేరే ఎవరిని చేసుకోదల్చుకోలేదు. రాజ్యాన్ని నాకివ్వటం ఇష్టమయితే ఇవ్వండి. ఏ కష్టం వచ్చినా, ఇద్దరం భరించి సుఖపడగలిగితే సుఖపడతాం. లేదా - నేనొక్కణ్ణే! ఒక్కపొట్టా పోషించుకోలేకపోను. పెళ్ళయితే మేమిద్దరం వకటి, లేదా నేనొక్కణ్ణే వక్కణ్ణే.

మాధ—తొందరపడకు కనకం. ఇది మనందరికి సంబంధించిన విషయం బాగోగులు అందరం ఆలోచించుకోవాలి.

కన—ఆలోచించే చెప్పండి. నన్ను ఇవ్వాళే యిల్లువిడిచి పొమ్మన్నా - పోతాను.

మాధ—లోకమోహమ్, లోకం! ఆసంగతింకా నీదాకా రాలేదుగనక - నీకు తెలీదు. (కనకం వెళ్ళాడు)

మాధ —ఏమిటి నాన్నా నువ్వుగూడా...

కోదం—ఏమిటా! నీక్కూడా వేరే చెప్పాలా! మనమేం చిలుం పట్టిన డబ్బు చేతిలో వున్నవాళ్ళంకాదు. సామాన్య సంసారులం. ఉన్నంతలో కాస్త వృద్ధిలోకి రావాలనే, నాఆవేదన. కాని యిట్లా ప్రతిదీ మన నెత్తిమీద పడితే- మనకున్నది మూడురోజుల్లో మాయమయిపోతుంది - కర్పూరంలాగ. నేను నీసంగతీ - రాజ్యంసంగతీ తప్ప వేరెవరివిషయం ఆలోచించటంలేదు. అవును, ఇది లోకమే - మానవలోకం - ఆకలిదప్పులు లేని దేవతాలోకమయితే - స్వవిషయం ఏమాత్రం ఆలోచించనక్కర్లే.

మాధ—నాసంగతీ రాజ్యంసంగతీ ఆలోచిస్తున్నానన్నావ్! అటువంటప్పుడు రాజ్యం మనసుగూడా తెలిసుకోవాలిగా?

[రాజ్యం వస్తుంది]

రాజ్యం—(వచ్చి) నామనసు వేరే చెప్పాలా అన్నయ్యా! నీకు తెలీదూ?

కోదం—అందరిమనసు అందరికీ తెల్సు. ఒక్క నామనసే ఎవరికీ తెలీయందే?

(రాజ్యంకూడా మాధవం వంక చూస్తూ దుఃఖిస్తూ లోపలికి వెళ్తుంది మాధవం ఆలోచిస్తూ తోటలో సోఫామీద కూర్చుంటుంది అదిరిపడి – తలెత్తిచూసి)

మాధ—ఎవరది ?

శ్యామ—నేనూ, నీ మనోరమని.

మాధ—ఎట్లా వచ్చావ్ ?

శ్యామ—గాలిపొరల మీద తేలివచ్చాను.

మాధ—అవును. నువ్వు గాలి పొరలమీద తేలి రాగలవ్, శబ్ద తరంగాలమీద వూగుతూ రాగలవ్ ! కాని ఎందుకొచ్చావ్ ?

శ్యామ—కల్లోలంలో వున్న నీమనసుకు మార్గం చూపటానికి.

మాధ—అవును. నా పాలిటి దివ్యవాణివికదూనువ్వు. నాకు దారీ తెన్నూ. తోచని సమయానికి తయారవుతావ్. నే నిప్పుడు ఎటూ తోచని తంటాల్లో పడిపోయాను.

శ్యామ—అదంతా నేనూ విన్నాను.

మాధ—అయితే, మరి నన్నిప్పుడు ఏం చెయ్యమంటావ్ ?

శ్యామ—ప్రపంచంలో తనకు మాలిన ధర్మం లేదు. నువ్వు సుఖపడి యితరలను సుఖపెట్టగలిగితే మంచిదే. కాని నువ్వేకష్టపడి ఇతర్లని సుఖపెట్టాలంటే – అది జరిగే పని కాదు.

మాధ—అంటే నువ్వనేది...?

శ్యామ—నీ స్వవిషయం నువ్వు ఆలోచించు. రాజ్యం సంగతీ అక్కర్లేదు - కనకం సంగతీ అక్కర్లేదు.

మాధ—అదేమిటి, వాళ్ళిద్దరూ ఎంతో ప్రేమిస్తున్నారు.

శ్యామ—వాళ్ళ ప్రేమను పరిగణిస్తే నీ భవిష్యత్తుకే దెబ్బ.

మాధ – అంటే వాళ్ళ 'పాల' లో పాషాణం కలపమంటావా? అహహా – నేచెయ్యలేనా పని.

శ్యామ—అవసరమైతే వీళ్ళొక లెక్కేమిటి. ఒక్కొక్కపుడు కన్నతండ్రినే ఇంట్లోంచి నెట్టివెయ్యాల్సి వస్తుంది.

మాధ—అహ – నేనంత క్రూరానికి దిగలేను.

శ్యామ—సుఖపడటం ప్రపంచంలో క్రూరత్వానికే చేతనవును.

మాధ—నువ్వుకూడా ఇదే సలహా. నువ్వేదో దారిచూపించే ధ్రువతారవనుకున్నాను. నడి సముద్రంలో నావలోవున్న నామనసుకు చక్కని చుక్కాని వనుకున్నాను. నీ నోటి వెంట వెలువడే ప్రతిమాటలో మాధుర్యమే నిండి వుంటుందనుకున్నాను. పాషాణంకూడా కలిసి వుంటుందనుకో లేదు.

శ్యామ—నా సలహా యివ్వాళ కాకపోతే రేపయినా నచ్చక పోదు. ఆనాడు నీ అంతట నువ్వే నామాట పాటిస్తావ్. నే వెళ్తున్నా. (వెళ్ళింది)

మాధ—(కళ్ళు మూసుకుని) ఆమాట సాగే పాపపుక్షణం ఏనాటికి రాకుండా ప్రార్థిస్తాను. (కళ్ళు తెరచి చూచి) ఓ మాయమైయ్యావే!

రాజ్యం—(వచ్చి) ఎవరితోరా మాట్లాడుతున్నావ్?

మాధ—ఎవరితోనూ లేదు.

రాజ్యం—అహా, నీ మాటలు నే వింటే!

మాధ—ఎవరితోనూ లేదు - నా మనసులో నేనే మాట్లాడుకుంటున్నా.

రాజ్యం—నా కోసం నువ్వేం బాధ పడకన్నయ్యా! నా బాధ మీ కేం లేకుండా నేనూ తప్పుకుంటాను.

మాధ—అంటే...!

రాజ్యం—నే వెళ్తే మీ బాధలన్నీ తగ్గుతాయ్. మీరూ సుఖపడతారు. నా సౌఖ్యమంటావా - బావతో నే నిండులో దూకినా - నాకు సౌఖ్యమే.

మాధ—రాజ్యం! నీమాటల్తో మరింత మంట పెట్టకు. మీ కోసం నన్నేం చెయ్యమన్నా చెయ్యాలనివుంది. త్యాగంలో యీ శరీరాన్ని ఆహుతి పెట్టాలనుంది. ఒక ఆవేశంలో ముందుకూ, మరో ఆలోచనలో వెనక్కూ- మనస్సు ఉయ్యాలలూగుతున్నది. ఒక నిశ్చయంలో నిలవటం లేదు. మనసు చల్లబడేవరకు నన్ను వంటరిగా వుండనీ. వెళ్ళు, బావను వకసారి పిల్చుకురా. మాట్లాడాలి.

(రాజ్యం వెళ్ళిపోయింది)

కోదం—(చేతిలో ఒక వుత్తరం పుచ్చుకుని విపరీతమయిన సంతోషంతో వచ్చి) మాధవం...మాధవం - మా పెద్దనాన్న కొడుకు, మా పెద్దనాన్న కొడుకు చచ్చిపోయాడట్రా,..చచ్చిపోయాడట,

మాధ—చచ్చిపోయాడా ?– పాపం !

కోదం—వాడికీ కొడుకులు లేరు — భార్యాపిల్లలు లేరు – వాడి ఆస్తికి – యిక – వారసులం మన వక్కళ్ళమే.

మాధ—మనమా ! !

కోదం—ఆ...మనమే. వాడు బొంబాయిలో లక్షలు సంపాదించాడు. లక్షలు మనకు వదిలిపోయాడు. ఇక అదంతా మనదే!



మాధ—మనదా ?

కోదం—మనదే! అమాతంగా లక్షలు – చేతికొస్తున్నయ్ ! మామయ్య – మీ పరంధామయ్య – మాపయ్యకు ఒకటె నిమిషంలో మనం గొప్పవాళ్ళమైపోయాం. వచ్చేది చాలక నానావస్థలుపడే రోజులు పోయినయ్ – ఇకమనం శ్రీమంతులం. ఏ బాధ తెలీకుండా – అనుభవించగలిగిం దంతా అనుభవించటానికి, పరంధామయ్యగారిని క్రింది చూపు చూడటానికి యీరోజుకు అదృష్టం కలిసివచ్చింది.

మాధ—అదృష్టం ?

కోదం—అదృష్టం – ఈ వూళ్ళో – ఈ జిల్లాలో – ఈ చుట్టు ప్రక్కల వ్వోడికీరాని అదృష్టం! యివ్వాళ మనకొచ్చింది– ఇక యీయిల్లంతా మార్చేద్దాం – దీన్ని పెద్దభవనం చేశేద్దాం – చుట్టూ తోటని పెంచి పెద్దది చేద్దాం. ఇక స్థాయిగ జీవిద్దాం.

మాధ—అవును -అవును నాన్నా ! నువ్వు అవస్తపడాల్సిన రోజులు దాటిపోయినయ్. ఇక హాయిగా రిటైరయి ఏ బాదరబందీ లేకుండా జీవితం సుఖంగా అనుభవించు.

కోదం—అలాగే. కాలిమీద కాలేసుకుని కూర్చోవచ్చు. కలిసివస్తే ఇలా కలిసి రావాలి.

(ఇంతలో టెలిగ్రాం జవాను వస్తాడు)

మాధ — ఏమిటది ?

కోదం—ఎక్కణ్ణించి వచ్చిది ? ఆఫీసు కొచ్చిందా ? ఇంటి కొచ్చిందా ? ఆఫీసు కేగా !...నాకు తెల్సు దీంట్లో యేదో వుంటుంది – యేమిటది – చెప్పవేం ?

మాధ—(ఇంతలో మాధవం టెలిగ్రామ్ చింపి చూసి తెల్ల బోయి) ఆఫీసుకు కాదు – నాన్నా – పరంధామయ్య మామయ్యకు వచ్చింది – ఆయన వ్యాపారం మునిగి పోయిందట.

కోదం—మామయ్య వ్యాపారమేనా? (గబగబా టెలిగ్రాం చదివి) మామయ్య వ్యాపారం – పరంధామయ్యగారి వ్యాపారం – మునిగిపోయింది – మట్టిగొట్టుకుపోయింది – Crash - Busine s - Cresh - దివాలా – దివాలా కొట్టుకు పోయాడు.

మాధ—పాపం!

కోదం—పాపం లేదు – గీపం లేదు...అంతే కావాలి. జరగ వలసిందే జరిగింది – జరగవలసిందే జరిగింది (అంటూ బిగ్గరగా నవ్వుతూ లోపలికెళ్ళాడు)

[రాజ్యం గబగబా అన్నయ్యా అన్నయ్యా అంటూ పరుగెత్తుకు వచ్చి]

రాజ్యం—అన్నయ్యా! అన్నయ్యా! బావ యింట్లో కనిపించ లేదు.

మాధ—కనిపించ లేదు!

రాజ్యం—ఆ. ఇంట్లో లేడు. పెట్టెకూడా పట్టుకుపోయినట్లున్నాడు. పెట్టీ Bed కూడా లేవు.

మాధ—అయితే యింట్లోంచి వెళ్ళాడా! చూసివస్తానాగు.

(మాధవం గబగబా లోపలికి వెళ్లాడు. రాజ్యం దుఃఖిస్తూ మధ్యకొచ్చి సోఫామీద కూర్చుని వుండగా]

—: తెర :—

## రెండవ రంగము

[రాజ్యం వంటరిగా కూర్చుని వున్నది. బోలెడు నగలు, మంచి విలువైన చీర ధరించింది. వరండాలో విలువైన కుర్చీలు, టేబుల్, టేబుల్ క్లాతు, ఫ్లవర్ వాస్ తోటలో బాగా ఎదిగిన చెట్లనిండా పూలు వుంటాయి. అంతా డాబుసరిగా కనిపిస్తుంది]

మాధ—(వచ్చి; రాజ్యాన్ని చూశి) రాజ్యం – వంటరిగా కూర్చున్నావేం (దగ్గరకుకెళ్ళి చూశి) అదేమిటె, కనీళ్ళా!

రాజ్యం—(మాట్లాడదు)

మాధ—నాకు తెలుసు. కనకం కోసం కదూ! నీ సంగతి ఆలోచించటం మరచాననుకున్నావా రాజ్యం. నిన్న దోవలో కనకం కనిపించాడు. ఇక్కడికి రమ్మాన్నాను. కష్టపడి Bank ఉద్యోగం సంపాదించాడు. వెధవ పట్టుదల ఇంకా ఎన్నాళ్ళో?

రాజ్యం—నిజంగా వుద్యోగం సంపాదించాడా?

మాధ—నీతో అబద్ధం చెపుతానా! ఇప్పుడో, సాయం కాలమొవస్తాడు. నువ్వే అడుగు అన్నీ సంగతులూ మాట్లాడదాంలే. నాన్నకూడా చెప్పి – అన్నీ సరి చేస్తాగా. ఇంత మాత్రానికే బెంగపడతావేం? ఇదిగో ఇది నీకు Present గా తెచ్చాను – (అని జేబులోంచి Dimond Necklace తీసి రాజ్యానికి యిస్తాడు)

[కోదండం ఇంట్లోంచి దగ్గుకుంటూ వస్తాడు ఆయన్ని చూశి]

మాధ—ఇట్లావచ్చావేం? అసలేజలుబుగా వుందంటూ యిలా గాలిలో కొచ్చావేం ?

కోదం—ఆ, నీతో వక్కమాట చెప్పాలని వచ్చా. చూడమా, ఆపెద్దమిల్లు గుమాస్తా వున్నాడే - వాణ్ణి పనిలోంచి తీసెయ్యి. నిన్ననగా రమ్మని ఖబురుచేస్తే యింతవరకూ రాలేదు - వెధవ.

మాధ—రాలే! వస్తాడులే...

కోదం—ఆ. రెండోది Ford Car - మళ్ళీ Repair కి తగలడ్డది అది అమ్మేశి Ply Mouth కొందాం మాగు - కొత్త మోడల్ బాగుంది.

మాధ—అలాగే.

కోదం—చూడు - నిన్న Order చేసిన Dimond Necklace యింకా వాడు తెచ్చి యివ్వలేదుగా?

మాధ—తెచ్చాడు - ఇదిగో (అని రాజ్యం మెడవైపు చూపిస్తాడు)

కోదం—ఏది......బాగుంది...ఈ పిచ్చి చీర కట్టుకున్నావేమమ్మా? మొన్న కొన్న కొత్తది Silk చీరె - జరీ Stripes ది అది కట్టుకోక పోయినావ్! పో - పోయి కట్టుకురా - ఎన్ని వున్నా యీ పిచ్చి చీర ఏమిటే - వస్తా - అసలే జలుబుగా వుంది. (లోపలి కెళ్ళాడు)

రాజ్యం—కావల్సినన్ని నగలు, కావల్సినన్ని చీరెలు అన్నీ వున్నై కాని.

మాధ—కాని...ఏం లేదు రాజ్యం?

రాజ్యం—(మాధవం వంక కళ్ళ నీళ్ళతో చూస్తుంది)

మాధ—రాజ్యం, ఇప్పుడు మనం చాలా భాగ్యవంతులం. అప్పుడంటే మనం పరంధామయ్య కంటికి మనం ఆనలా. కాని ఇప్పుడు వేరు - బావని పిలిపించి - మీ పేర కొంత ఆస్తి వ్రాసిచ్చి పెళ్ళి చేయటానికేం అభ్యంతరం లేదు. నాన్నని వప్పించే బాధ్యత నాది. ఏమంటావ్?

రాజ్యం—అన్నయ్యా. నా ఆశలన్నీ నీమీదే వున్నాయి.

(గోడ అవతలనుంచి శ్యామల పాడుతోంటుంది. అది మాధవం విని)

మాధ—ఇక ఏ బెంగా లేకుండా వుండు. లోపలికి పో. పెళ్ళి జరగబోయేదాన్ని తలచుకొని మురిసిపో వెళ్ళు.

(రాజ్యం లోపలి కెళ్ళింది. మాధవం గోడదగ్గరగా వెళ్ళి)

మాధ—కోమల గానంతో కోరిక లూరించే కోకిలా వేళ గాని వేళ - వలుపు పిలుపులు వెదజల్లుతున్నావేం?

శ్యామ—(గోడ అవతలనుంచి కొంత కనపడుతూ) మమకారంలో చకోరం మతి మరచి పోతోంది.

మాధ—మతిపోయి స్మృతి దప్పనను మరచి పోవుగా?

శ్యామ—పూవు తన తావినే మరచి పోతుందా - రాత్రి కన్నా వచ్చి చల్లని వెన్నెలై చిలకరిస్తావా. నిండు పున్నమినాటి వెన్నెల జల్లులో వలపు పందిరిక్రింద నీకల

రూపు కాంతిలో కలిసి పోవాలనుంది. వస్తావా - వెతల ముంచుతావా ?

మాధ—నేనివతల - నీవవతల - మధ్యన యీ అవాంతరపు గోడ. (గోడచూపిస్తాడు)

శ్యామ—ఉంటేయేం ? అధిగమించటానికి ఈ అవాంతర మేమంత పెద్దది?

మాధ—అయితే......రమ్మంటావా......ఇప్పుడేరానా ? ఎట్లారాను? (గోడ ఎట్లా ఎక్కటమా అని తారుట్లాడుతాడు)

శ్యామ—రా. పువ్వుఎదమీద వకపదం, మధురాధరంమీద మరోపదం వుంచి అధిగమించి తలపు తావులమీద తేలిరా.

మాధ—ఇదిగో వస్తున్నా (అని ప్రక్కకు వెళతాడు)

(రాజ్యం, కనకం వస్తారు)

రాజ్యం—అన్నయ్యా ఇక్కడేవుండాలే - ఏడీ?

కన—లేడు.

రాజ్యం—గోడదాటి వెళ్ళినట్లున్నాడు.

కన—వెళ్ళేవుంటాడు.

(ఇంతలో కోదండంవచ్చి)

కోదం—మాధవం ఏడీ?

రాజ్యం—ఏడీ -లేడే!

కోదం—ఇప్పుడిటే వచ్చాడే......నువ్వెప్పుడొచ్చావురా కనకం?

కన—ఇప్పుడే.

కోదం—ఊఁ - మాధవం - ఎక్కడికి వెళ్ళినట్టూ...అని...?

రాజ్యం—బయటికి వచ్చాడేమొ!

కోదం—లేదే - నేను సావిట్లో నేవున్నా. అటురాలే......

(రాజ్యం, కనకం మాధవం వెళ్ళినసంగతి దాచటానికి ప్రయత్నిస్తుంటారు వాళ్ళనుచూసి అనుమానించి)

కోదం—అదేమిటే - అట్లా బిత్తరపోతావేం?

రాజ్యం—నే చూడలే - ఎటువెళ్ళాడో.

కోదం—చూడలే. ఇక్కడున్నదానివి చూడలేదంటావేం? బావరాంగానే కళ్ళు నెత్తిమీద కొచ్చాయూ? అట్లా ఆ గోడవంక చూస్తావేం? ఏముందక్కడ?

రాజ్యం—(కంగారుగా) ఏంలేదు.

కోదం—ఏం లేకపోతే ఎందుకలా చూస్తాన్?

రాజ్య—ఏదో చప్పుడవుతేనూ......

కోదం—చప్పుడా! ఏంచప్పుడు? (దగ్గరగావెళ్ళి గోడదగ్గరగా వెళ్ళి నుంచుని వింటాడు. రాజ్యం కనకం ఏదో ఆ మాట్లాడుకోబోయి నోళ్లు మూసుకుంటారు. కోదండం విని వెనక్కితిరిగి)

కోదం—ఏమిట్రా అది?

రాజ్యం—ఏంలే.

కోదం—పావురాళ్ళలాగ అలాగుబగుబ లాడతారేం? (గోడ కింకా దగ్గరగావెళ్ళి వినబోతుండగా రాజ్యం ఖంగారుపడి...- )

రాజ్యం—అయ్యయ్యో!

కోదం—అయ్యయ్యో! అయ్యయ్యో అంటావేమిటీ?

రాజ్యం—ఏంలే.

కోదం—ఏంలే?

రాజ్యం—ఏంలే! బావనెత్తిన ఏవో పడితేనూ...

కోదం—బావనెత్తిన...ఆ - ఏంపడింది?

రాజ్యం—ఏదో ఆకు.

కోదం—ఆకా?

రాజ్యం—ఆకు కాదు. కాయ.

కోదం—ఏం కాయ?

కన—కాయ గాదు గీయ కాదూ.

రాజ్యం— కాయ గాదు గీయ కాదూ. గో. గో. గో. గో.

కోదం—గో గో గో ఏమిటి గో గో.

రాజ్యం—గోడ.

కోదం—గోడ? గోడేమిటి? గోడ (గోడదగ్గర కెళ్ళి వింటాడు)

గోడ అవతల :-

శ్యామ —రేపు ప్రొద్దున తప్పకుండా వస్తావుగా?

మాధ—ఆ.

శ్యామ—వస్తే అన్నివిషయాలు మాట్లాడుకుందాం.

కోదం—ఎవరా మాట్లాడేది?

రాజ్యం—ఉ...ఉ...ఊ. ఊ. మేమే.

కోదం—ఇప్పుడు మాట్లాడింది - మీరా!!

రాజ్యం—అ.
కోదం—శబ్దం అటునుంచి వస్తున్నట్లుందే?
రాజ్యం—అహా - కాదు - ఇటునుంచే.
(ఇంతలో గోడ అవతలనుంచి వినబడుతుంది)
మాధ—మళ్ళీ రేపటిదాకా తిరిగి కనిపించవు కాబోలు. అబ్బ! కాచుకు కూర్చొని - కూర్చొనీ - కళ్ళు కాయలుకాచి పోతున్నై. నాకంటికాటుకవై కనుపాపలోఎప్పుడూ ప్రకాశిస్తూవుంటే ఎంత బాగుంటును?
శ్యామ—వెళ్తాను. చాలాసేపయింది.
మాధ—అంత తొందరేం? నీ సాన్నిధ్యంలో - వింత లోకాల విహారించే సంతోషం కాస్తంత కలుగజెయ్యి. అంతలోనే నాకెంతో తృప్తి.
కోదం—ఇవీ మీ మాటలేనా?
రాజ్యం—కావు.
కోదం—కావుగదా. అయితే అవతల వున్నదెవరో మీకు తెలియకుండానే వున్నారా?
రాజ్యం—(సిగ్గుపడి వూరుకుంటుంది)
కోదం—మీకు తెలియకపోయినా నాకు తెలుస్న. అవతల వున్నది మీ అన్న...ఊఁ...ఇదెన్నాళ్ళనుంచి?
[పరంధామయ్య ప్రవేశించి]
పరం—ఆహా - ఇల్లంతా వదలి మీరిక్కడున్నారూ!
కోదం—ఓహో! బావగారా - ఎప్పుడు దిగారు? రాజ్యం - కాదు. కనకం - ఆ కుర్చీ (పాతది చూపించి) ఇలా

వెయ్యి మీ నాన్న కూర్చుంటాడు...ఆ...ఏం బావ గారూ! చాలా రోజులకు దర్శనమిచ్చారే ?

పరం—అహాహ – చాలా రోజులేముందీ !...మూడు నెల లేగా !

కోదం—ఊఁ...వ్యాపారం అదీ బాగా సాగుతోందా?

పరం—ఏదో వుంది. (కనకం పాతకుర్చీ తెచ్చి వెయ్యగా కూర్చుంటాడు. 'అబ్బ' అని లేచాడు)

కోదం—ఏమిటది ?

పరం—కుర్చీలో మేకు...

(రాజ్యం నెమ్మదిగా వెళ్ళిపోతుంది)

కోదం—గుచ్చుకుందా – కాస్తచూసి కూర్చో. మంచి కుర్చీలన్నీ లోపలున్నట్లున్నాయ్ !

పరం—అలాగే లే.

కోదం—ఊఁ – "ఊరకరారు మహాత్ము"లని – ఇన్నాళ్ళకు మా యిల్లు కన్పించిందేం?

పరం—అహాహ అల్లా అనకు బావా! అయినవాళ్ళం ఎన్ని మాటలనుకున్నా చుట్టాలమేగా – అబ్బ –

కోదం—అట్లాగే లే !

పరం—చూశావ్. మనకీ మనకీ కాస్త పేచీ వచ్చి, కనకా నికీ – రాజ్యానికీ కాకుండా చేశాం. కనకం యిటు నాకూ, అటు నీకూ కాకుండా మధ్య నలిగిపోతున్నాడు. "సరే కానీ వాడి మాటే సాగనిద్దా" మని వచ్చా.

కోదం—మరి నీ గుంటూరి స్నేహితుడికి కూతురుందిగా?
పరం—అది కనకం కాదన్నావుగా?
కోదం—నువ్వదే కావాలన్నావుగా!
పరం—అహహా యేదో తొందరపడి అలా అన్నా :: గుకో -
(మేకు గుచ్చుకుని) అబ్బ
కోదం—అన్నీ ఆలోచించుకొని యిప్పుడు కాదనఖ్ఖర్లేదులే. రాజ్యానికి నే వేరే సంబంధం చూస్తున్నాను.
పరం—ఉహుహు.
కోదం—నేనన్నీ అలోచించాను. ఇప్పుడు నా తాహతుగల సంబంధం తేవాలిగాని - నీ తాహతువాణ్ణి కాదు. నా కూతురి భవిష్యత్తు నేనాలోచించాలిగా?
పర—నువ్వు తల్చుకుంటే నీ కూతురి భవిష్యత్తుకేం బావా! అబ్బ. (మళ్ళీ కుర్చీమేకు గుచ్చుకుంది)
కోదం—ఆ...ఆ...ఈ మాటల అర్థం నాకూ తెల్సులే. రాజ్యాన్ని కనకానికిచ్చి కొంత ఆస్తిగూడ కలపమంటావ్ - అంతేగా?
పరం—కలిపినా - వాడేం పరాయివాడు కాదుగా.
కోదం—పరాయివాడెందుక్కాదు. మాకాస్తి లేనప్పుడు తెంచుకుపోయినవాళ్ళు - ఆస్తి కలసిరాగానే తలవంచుకు వచ్చారు. ఏదైనా సమయంకూడా మించిపోయింది. రాజ్యం పెళ్ళి విషయంలో నేను మాట యిచ్చేశాను.
పరం—అహా...అయితే...అంతే నంటావ్.

కోదం——ఆ. నీ ఆశలన్నిటినీ తోశేసి కావాలంటే కనకానికి వేరే యేర్పాట్లు చేసుకో.

పరం——అహహా !!

కోదం——నా యేర్పాట్లు నేనూ చేసుకుంటున్నాను. ఇవ్వాళే అవతల వాళ్ళింట్లో శ్యామలను చూడటానికి యిక్కడ రాజ్యాన్ని చూడటానికి పెండ్లికొడుకు లొస్తున్నారు.

పరం——ఏమిటీ...ఇవ్వాళే –!!

కోదం——ఇవ్వాళే. ఇప్పుడో కాసేపటికో వస్తారు. వాళ్ళ మ్మాయిని చూడటానికి వస్తుంటే ... పన్లోపని, మా అమ్మాయినికూడా చూడమని అడిగివచ్చాను. ఆ – ఏదీ రాజ్యం! ఇంతలో ఎక్కడికెళ్ళావే...?

(కోదండం లోపలికెళ్ళాడు)

పరం——హు – కాస్త ముదనష్టం కలిసివచ్చేటప్పటికి కళ్ళు నెత్తిమీద కొచ్చాయి.

కన——ఉన్నది కాస్త పోయింతరువాతేగా మనం కళ్ళు తెరిచింది?

పరం——చూశావా. కాస్త మంచి కుర్చీఅన్నా వేయించాడేమొ. నాకు తెల్సు – వీడిబుద్ధి. అందుకే నేను వీళ్ళ సంబంధానికొప్పుకోనిది.

కన——ఇక యెందుకూ? వెళ్ళిపోదాం పద.

పరం——ఇంత కళ్ళుతిరిగిపోవటమా! చూద్దాంగా యీ నడమంతరపు సిరి ఎన్నాళ్ళో?

కన—అదేమిటి.

పరం—కాక? - ఇలాటివాళ్ళని చాలామందిని చూశాను. మీ మామ ఏం వ్యాపారం చేస్తున్నాడో తెల్సా!... ఇదివరకు నేచేసిందే. ప్రపంచంలోకల్లా లాటరీవ్యాపారం. ఉన్నదంతా దాంట్లోనే పెట్టాడు - పరిస్థితులు వ్యతిరేకిస్తే ఇంత లక్షాధికారీ క్షణంలో బికారీ కావచ్చు.

కన—అంటే, ఇది నిలబడదంటావా?

పరం—నలభై ఏళ్ళు దాంట్లో మెలిగినవాణ్ణి-నేనే తట్టుకోక పోతే - ఇక వీళ్ళా!

కన—అయితే వాళ్ళూ మనలాగే తయారవుతారంటావా?

పర—మనతో! మనకేం!! నేను వ్యాపారంలో దివాలా కానీ, - మనిషి దివాలాకొట్టలేదు. భగవంతుడికైనా తెలియదు. నాదగ్గర లక్షన్నరభద్రంగా వుంది. ఆ మాత్రం చాలు - మనపొట్టకి.

కన—అల్లాగా ?

పర—వస్తున్నాడు...వూరుకో (కోదండం వస్తాడు)

[ఒక సేవకుడు కోదండం వస్తారు]

కోదం—(హడావుడిగావచ్చి) ఒరేయ్! ఆ కుర్చీ యిటు పట్టుకురా - ఇటు...

పరం—బావా - తొందర్లో వచ్చేశాను. ఒక పాతిక రూపాయిలుంటే యియ్యి. ఇంటికివెళ్ళి పంపిస్తాను.

కోదం—ఆగు - వాళ్లొస్తున్నారు.

పరం—ఎవరూ!

కోదం—వాళ్లే - రాజ్యాన్ని చూడటం కోసం వస్తున్నారు. (కుర్చీలు వేస్తూ నౌకరుతో) ఇంకో రెండు పట్టుకురా. (పరంధామయ్యతో) మీరూ వుండండికాస్త - ఏదో మాటా మంచీ జరపటానికి వుంటే బాగుంటుంది. వస్తా (లోపలికి వెళ్ళాడు)

కన—నువ్వుండు - నే వెళ్తా...

పరం—ఏం?

కన—నే నెందుకు?

పరం—నేనుమాత్రం ఎందుకు? ఇద్దరం కలిసే వెళదాం.

(కోదండంతో పాటు ఒక యువకుడు, ఒక ముసలి వ్యక్తి వస్తాడు)

కోదం—(పరంధామయ్యతో) వీరే - ఆ అబ్బాయి - పెళ్ళికొడుకు.

పరం—చిత్తం - దయచెయ్యండి. (లేస్తూను తనకుర్చీ చూపిస్తాడు).

కోదం—(వ్యంగ్యంగా) వీరు మా బావగారు.

ముసలి—అహా - అల్లాగా?

పరం—ఇల్లా దయచెయ్యండి (తనకుర్చీ చూపిస్తాడు)

కోదం—అహాహా - (వేరే కుర్చీ చూపిస్తూ) యిల్లా - యీ కుర్చీలో దయచెయ్యండి - నువ్విలా కూర్చో నాయనా. (అని పెళ్ళికొడుకుతో అంటాడు)

ముసలి—అహా...ఇల్లా కూర్చుంటూ లెండి. ఫర్వాలేదు. (అని పరంధామయ్య కూర్చుని లేచిన కుర్చీలో కూర్చుంటాడు) మనలో మనకి ఏకుర్చీలో అవుతేనేం (కూర్చుంటాడు. ఆకుర్చీలోవున్న మేకు గుచ్చుకుని తెల్లమొహం వేసి) అబ్బ! ఏదో గుచ్చుకున్నట్లుందే?

కోదం—అందుకనే ఈ కుర్చీలోకిరండి.

ముస—అహా. ఫర్వాలేదు. ఇది బాగానే వుంది. మేకు చిన్నదే.

కోదం—నేను అమ్మాయిని తీసుకొస్తాను. మీరుమాట్లాడుతుండండి.

(కోదండం లోపలి కెళ్ళాడు)

పరం—ఆ. తమ దేవూరండి?

ముస—ఈ ప్రక్కనే కానూరు

పరం—పల్లెటూరా!! అహా! సారే-అబ్బాయి ఏం చదువుతున్నాడు.

ముస—బి. యె.

పరం—బి. యె. యేనా - సారె - ఉ, అన్నదమ్ములూ?

ముస—ఇద్దరూ. వీడు చిన్నవాడు. పెద్దవాడికి ఆ ఇంట్లో శ్రీరాములుగారి అమ్మాయిని ఇస్తామంటున్నారు.

పర—శ్రీరాములుగారి అమ్మాయినా? - సారె - ఊఁ, ఆస్తి ఏపాటి?

ముస—చేరి యాభై ఎకరాలు వస్తుంది.

పరం—ఇంతేనా...సారే, అయితే మీకు ఎక్కువ కట్నం ఆశ లేనట్లుంది.

ముస—ఆ!

పరం—పెద్దబ్బాయికి ఎంత కట్నం యిస్తా మన్నారు.

ముస—ఎంత లెండి. 20 వేలు.

పరం—20 వేలే! మా వాడూ అంతాయిస్తానన్నాడూ?

ముస—ఆ. మీవాడి కిదొక లెఖ్ఖటండి.

పరం—అహాహా, అది సరే. ఇవ్వలేనివాడు కాదు. కాని వ్యాపారంమీద తిరుగుతున్న డబ్బు ఉన్నట్టే వుంటుంది. కాని చేతిలో కానీ కనిపించదు. మీకంటే పొలంమీద వుంది గనుక ఏం ఫరవాలేదు. కాని మావాడు అంతా వ్యాపారంమీదే పెట్టాడు లెండి.

ముస—అలాగా - స్థిరాస్తి ఏం లేదా?

పరం—ఏం లేదు. ఈయిల్లు, అవతల మరో పాత ఇల్లు తప్ప. అది వక లెఖ్ఖమిటిలెండి! ఇవ్వాళో రేపో కూలి పోయే ట్లుంది. ఊఁ, కుఱ్ఱవాడు కాస్త మెత్తనివాడల్లే వున్నాడే; మాట్లాడటం లేదు; అహాహా! మా రాజ్యాని కిల్లా అయితే పనికిరాదయ్యోవ్.

ముస—(నవ్వుతాడు)

పరం—ఉరికే అన్నానండోయ్. మరేం లేదు.

ముస—(కనకాన్ని చూపిస్తూ) ఆ అబ్బాయి ఎవరు?

పరం—వాడా అబ్బాయి - అంటే - కోదండరంగారి మేనల్లుడు.

ముస—స్వయానా!

పరం—ఆ, స్వయానా. కేవలం చెల్లెలి కొడుకు.

ముస—ఆహా - పిల్లలా ?

పరం—ఎవరికి ?

ముస—మీ వాడికే ?

పరం—అబ్బే - పెళ్ళికానిదే.

ముస—పెళ్ళి కాలే ?

పరం—అహహ - పెళ్ళికాలే.

ముస—అయితే మరి - అయిన సంబంధం...

పరం—ఆ. అయిన సంబంధమే......

ముస—మరి వదిలేశారే?

పరం—మేమే వదిలేశాం. అహహ అదంతానన్నడక్కండి. అదో పెద్ద గ్రంథం.

ముస—సరే లెండి...ఏం చదువుతున్నాడేం ?

పరం—చదువా. B. A. చదువు తున్నాడు. ఇక్కడే ఈ వూళ్ళోనే - మన వాళ్ళింట్లో వుండే చదివాడు మొన్నటి దాకా.

ముస—అయినవాళ్ళేగా? దానిదేముంది లెండి.

పరం—కాని ఆరునెలలబట్టి వేరే వుంటున్నాడు.

ముస—వేరేనా...ఈ వూళ్ళోనే ?

పరం—ఆ, ఈ వూళ్ళోనే.

ముస—ఏం - ఇక్కడే వుండడమ్మాగా?

పరం—ఉండవచ్చు. కాని ఎదిగిన పిల్లలు వక్కచోట వుండటం బాగా వుండదు చూడండి.

ముస—అవునవును. నేనూ అదే అనుకున్నా...ఇంకా రాలేదేం కోదండంగారు.

పరం—వస్తారు. పెళ్ళికూతుర్ని చూపించేటప్పుడు కాస్త అలంకారంతో చూపించాలి – చూడండి.

ముస—ఎందుకండీ?...మామూలుగా చూస్తేనే బాగుంటుంది.

పరం—అల్లా అనకండి. మామూలుగా చూస్తే మామూలుగానే వుంటుంది. కాస్త మెరుపుల్లో చూస్తే మెరుగ్గా వుంటుంది...అదిగో వస్తున్నారు.

[కోదండం రాజ్యాన్ని తీసుకొస్తారు]

కోదం—(రాజ్యాన్ని మధ్య కూర్చోపెట్టి) ఇంట్లో పెద్ద ఆడదిక్కు లేకపోతే ఎంత అవస్థో చూడండి. ఇదే మా అమ్మాయి. స్కూలుఫైనలు దాకా చదివింది. తరువాత మానేసింది.

పరం—సంగీతం పాడించమన్నారా?

ముస—వద్దులెండి.

పరం—అహాహా; వద్దనకండి – పోనీ చదివించనా.

ముస—వద్దండీ. ఎందుకూ?

పరం—ఉహుహు, అన్నీ వద్దంటారేమండి? పోనీ ఏ పరీక్షకాపాలో చేసుకోండి.

మ.స.—ఏ పరీక్షలూ వద్దు.

పరం—అబ్బే మీరల్లా అనటమేమీ బాగాలేదు. ఊఁ, అయితే అమ్మాయిని వెళ్ళమంటారా.

ముస—(ఏదో పెళ్ళికొడుకుతో మాట్లాడి) వెళ్ళమనండి.

పరం—ఏం, నచ్చలేదా యేమిటండి?

ముస—అబ్బే! నచ్చటానికేముంది లెండి? మావాడికి నచ్చిందట. అయినా ఈ అందచందాలదేముంది లెండి? పరువు మర్యాదలు చూడాలిగాని. సరే - అయితే - కోదండంగారు - వస్తాం. ఆయింట్లో అమ్మాయిని మా పెద్దాడు చూశాడు. ఒప్పుకున్నాడు. నే వెళ్ళి మళ్ళీ వస్తాను. అన్ని సంగతులు మాట్లాడుకుందాం - తీరుబడిగా. మరి మేము రామా?...

కోదం—కాస్త ఫలహారం చేసి వెళ్ళండి. (అని లోపలికి వెళ్ళబోతుండగా)

(రాజ్యం గోడవంక చూసి 'బావా' అంటూ గభాలున లేచి కనకందగ్గర కెళ్తుంది - ఖంగారుపడ్తూ)

కోదం—అదేమిటి?

ముస—ఏదైనా అంత మీదపడిపోతుందేమిటి?

రాజ్యం—గో. గో. గో. (అంటూ గోడవైపు చూస్తుంది.)

(గోడవైపునుంచి మాధవం వస్తాడు)

కోదం—ఏమిట్రా యిది?

మాధ—ఎంకే...(అంటూ గబగబా లోపలికెళ్తాడు. రాజ్యం కోదండం వెనకనే వెళ్తారు)

ముస——ఆ అబ్బాయి ఎవరు...?

పరం——కోదండంగారి కొడుకు.

ముద——ఆ అబ్బాయి గోడదూకి వచ్చాడేమిటి?

పరం——అదే! తెలియటంలే - ఏమిటో.

ముస——వస్తే ఆ అమ్మాయి అంత గాభరాపడిందేమిటో?

పరం——ఏమిటో?

ముస——ఆయనకూడ అంత గాభరాపడ్డాడేమిటో?

పరం——ఏమిటో?

ముస——ఆ ముగ్గురూ అంత కంగారుగా లోపలికి వెళ్ళారేమిటో?

పరం——ఏమిటో?

(పైనుంచి ఒక చిన్న రాతికి కట్టిన గులాబీపువ్వూ చీటీ వచ్చి పడింది.)

ముస——ఇదేమిటి!!

పరం——ఏమిటో!!

ముస——(తీసిచూసి చదివి) ఏమిటో ఏమిటి 'ప్రేమతో'

పరం——ప్రేమతో ఏమిటో!!

ముస——ప్రేమతో ఏమిటో ఏమిటి! గులాబీపువ్వు!!

పరం——ప్రేమతో గులాబీపువ్వేమిటో!!

ముస——ఏమిటో! ఏమయితే మాకెందుకు? మీసంగతులన్నీ తీరుబడిగా మీరే చూచుకోండి! మేం వస్తాం!

పరం — వస్తారా?...ఎప్పుడొస్తారు?

ముస—అహాహా. ఇక ఎప్పుడూ తాం? (వెళ్ళబోతూ) వస్తాం.

పరం—మళ్ళీవస్తామంటున్నారు!

ముస—ఇక రామూ - రామూ - రాము. సరేనా - వస్తాం (వెళ్ళారు)

పరం—ఏమిట్రా యిది?

కన—ఏమిటి?

పరం—మన మాధవం గోడదూకి రావటం - గులాబీపువ్వు ఎగిరి వచ్చి పడటం.

కన—అదా - ఏమిటో?

పరం—ఏమిటో ఏమిటి! నీమొహం - ఏదో వుంది. ఏమైతే నేం? ఆ ముసలాయన తెంపుకుపోయాడు. ఇక పద.

కన—ఇక మనమూ వెళ్దామా.

పరం—అహాహ. ఆగు. మామయ్యానుపరామర్శచేసి వెళ్దాం!

కన—ఆయన్ని డబ్బడుగుతావెందుకు - అర్థంలేకుండా? కావలిస్తే ఆ పాతికా నేనిస్తా తీసుకో.

పరం—నీదగ్గర వుందా?

కన—ఆ - ఇదిగో?

పరం—అహాహ - అక్ఖర్లే. వుంచుకో. నాదగ్గరావుంది.

కన—వుండే అడిగావా!!

పరం—ఆ.. వుండే అడిగా...అల్లా అడగాలి.

(కోదండం వస్తాడు)

పరం—వాళ్ళు వెళ్ళినట్టున్నారు-బావా!

కోదం—వెళితే వెళ్ళారులే. ఇలాంటివాళ్ళను పరాకళ్ళను తేగలను.

పరం—తేలేకపోం. కాని లోకంలో కాస్త అల్లరి రేగుతుంది చూడు.

కోదం—రేగితే రేగింది. లోకం నోరుకట్టటానికి నాదగ్గర ఆయుధం వుంది.

పరం—అవున్లే. "ధనమూలం ఇదం జగత్"

కోదం—అవును. ఆసంగతి నీకు బాగా తెల్సు - ఆ, నీకేదో కావాలన్నావ్. మాధవాన్ని అడిగి తీసుకో.

పరం—డబ్బుసంగతా? - సరేలే...

కోదం—ఇక యీాఇంట్లో నాదేం లేదు బావా. అంతావాడికే వదిలేశాను ... మంచయినా చెడయినా అంతా ఇక వాళ్ళదే. కడుపుతీపిగనక అప్పుడప్పుడు ఏదో బాగు చెయ్యాలనిపిస్తుంది. ఇక అదీ కల్పించుకోదల్చుకోలేదు - వాళ్ళేమన్నా ఏడ్చుకోనీ - మనకేముంది?

(మాధవం వస్తాడు)

కోదం—బాధ్యతెగుర్తించివాళ్లుప్రవర్తించాలిగాని-ఎన్నాళ్ళని మనమిట్లా వేళ్ళాడగలం?

మాధ—ఏదో పొరపాటయిందినాన్నా. ఇక జాగ్రత్తగా వుంటాలే!

కోదం—పొరపాటేమిట్రా! యింకా కుఱ్ఱతనమే! అయితే... ఈ ఆస్తిపాస్తుల్ని ఎలా వుద్ధరిస్తావ్ - ముందు ముందు?

పరం—అయిపోయిందేదో అయిపోయింది. ఇక దాని సంగ
తెందుకు? పోనిద్దూ. నే వస్తా మరి.

కోదం—సరే - మాధవం! మీ మామయ్యకు ఒక యాభై
రూపాయిలుయివ్వు. ఆ మూడోకారు '50' మోడలు మళ్ళీ
మూలపడిందట. ఏమిటో వెధవకారు. Van కు కబురు
చేసిమామయ్యనుస్టేషన్ దగ్గర దిగపెట్టు. నువ్వుండరా కన
కం - భోజనంచేసి వెళ్దువుగాని.

(కోదండం, పరంధామయ్య, మాధవం వెళ్ళారు. కనకం ఒక్కడు అటు యిటు పచారుచేసి సిమెంటు సోఫా మీద కూర్చుంటాడు. ఇంతలో మాధవం వచ్చి,)

మాధ—ఇక్కడే కూర్చున్నావేంరా ?

కన—ఆ.

మాధ—రాజ్యంతో మాట్లాడుతూ కూర్చోకపోయావ్.

కన—రాజ్యమా? ఎల్లా! రాజ్యం యిప్పుడు పరాయిపిల్ల.

మాధ—పరాయి ఏమిటోయ్ - పరాయి! ఏది ఎల్లా
వచ్చినా - రాజ్యానికి మానాన్న ఎన్ని సంబంధాలు
తెచ్చినా చివరికి రాజ్యాన్ని నీకే యిచ్చేది.

కన—నీ మాటలు వింటుంటే బాగానే వుంటుంది. కాని...

మాధ—కాని.

కన—నీకోరిక నాకోరిక కూడా తీరేట్టులేదు.

మాధ—అదేమిటి ?

కన—రాజ్యంతో నాపెళ్ళి, శ్యామలతో నీపెళ్ళి, రెండూ అయ్యేట్లు లేవు.

మాధ—శ్యామలతో నా!

కన—ఆ...

మాధ—అదేమిటి?

కన—ఇప్పుడు రాజ్యాన్ని చూడటానికి వచ్చారే.....

మాధ—ఆ.....

కన—వాళ్ళబ్బాడికే వకడికి శ్యామలని ఇస్తారట.

మాధ—ఊఁ.

కన—శ్యామలను చూడటానికే వాళ్ళసలు వచ్చింది.

మాధ—అహా.

కన—పరిస్థితులివ్వి. ఇక నన్నే ఆశపెట్టుకోమన్నావ్ చెప్పు.

మాధ—శ్యామలకి సంబంధమా! శ్యామలకి సంబంధమేమిటబ్బా!

కన—వాళ్లే అన్నారు. నువ్వు సమయానికి వచ్చావు గనుక గాని - లేకపోతే రాజ్యం సంబంధంగూడా సెటిల్ చేసుకు వెళ్ళేవాళ్ళే - వాళ్ళు.

మాధ—శ్యామల నాతో అనలేదే యీమాట!

(రాజ్యం వచ్చి)

రాజ్యం—నాన్న భోజనం చెయ్యరట. మీరు లేవండి, వంటయింది.

మాధ—నే తరువాత వస్తాను. ముందు బావకు వడ్డించమను. వెళ్ళరా – నువ్వు భోజనంచెయ్యి.

కన—సరే.

(కనకం, రాజ్యంతో లోపలికి వెళ్ళిపోయాడు. మాధవం కొంచెంసేపు అటు యిట్టూ తిరుగుతాడు. శ్యామల గోడవైపుగుండా వస్తుంది)

మాధ—నువ్వా?

శ్యామ—నేనే.

మాధ—ఎందుకొచ్చావ్?

శ్యామ—ఎందుకొచ్చావేమిటి? నే నెప్పుడూ నీ వెనకనే, నీ ఛాయలాగా నీలోనే వున్నాగా.

మాధ — అంతేగదా. నన్నొదిలి వెళ్ళిపోయావనుకున్నా.

శ్యామ—అలా ఎల్లా అనుకున్నావ్? కనులిసి కాంతి ఎడబాయగలదా?

మాధ—ఏమో! సరే. ఇది చెప్పు. ఒక సమస్య. ఒక లలితాంగి వక యువకుణ్ణి ముగ్ధుణ్ణి చేసి తన మనోసరసి హంసగా, తన ప్రేమ మధుకిరణాల్లో చకోరంగా – చేసుకుంది.

శ్యామ—అహా.

మాధ—అంతలో ఒకనాడు – అమాంతంగా వేరొక పురుషుణ్ణి వరించటానికి సిద్ధపడింది.

శ్యామ—అహా.

మాధ—ఆశలు వాడిపోయిన ఆయువకుడు అప్పుడేం చేయాలి.

శ్యామ—ఏంచేస్తాడూ? ఏ ఆత్మహత్యో చేసుకుంటాడు.
మాధ—కాని యిది ఈ ఉదయమే జరిగింది?
శ్యామ—అయితే నువ్వు శ్యామలనే శంకిస్తున్నావా?
మాధ—శంకించక ఏంచేయను.
శ్యామ—ఆ భయం నీకేం అక్కర్లే. ఎన్ని అవాంతరా లొచ్చినా ఆఖరికి శ్యామల నీదే.
మాధ—అయితే నాకు ధైర్యమే అరె! రాజ్యం వాళ్లొస్తున్నారు.
శ్యామ—రాజ్యం వాళ్లా - నేను మరి.
మాధ—వెళ్తావా. వెళ్ళు.

(శ్యామల వెళ్తుంది; రాజ్యం, కనకం వచ్చారు)

రాజ్యం—నువ్వూ భోజనం చెయ్యరామరా?
మాధ—ఊఁ... వెళ్లొస్తా. (అంటూ వెళ్తారు. రాజ్యంకూడ వెనకనే వెళ్ళబోగా)
కనకం—రాజ్యం! (ఆగింది)
కన—ఏంలేదు. వెళ్లు.
రాజ్యం—సరే (వెళ్ళబోతుంది)
కన—రాజ్యం!
రాజ్యం—ఏం బావా!
కన—నే వెళ్లొస్తా.
రాజ్యం—సరే (వెళ్ళబోయింది)
కన—రాజ్యం!
రాజ్యం—(వెనక్కి తిరగ్గా)
కన—(తల దించేశాడు)

రాజ్యం—ఏమిటి? - ఏమిటి బావా ఏమిటి?

కన—మనసు పొంగి వస్తోంది. మాటరావటంలేదు.

రాజ్యం—బావా!

కన—ఎన్నాళ్ళిల్లా బాధపడటం? ఎట్లా తేలని పరిస్థితి యుంకెన్నాళ్ళు?

రాజ్యం—నే కావాలని కోరుకుంటున్నా నాయిది? మనసు చంపుకుని బొమ్మలాగ ఎక్కడ కూర్చుంటే అక్కడ కూర్చోవటం ఎన్నాళ్ళని? నేనూ కుమిలిపోతూనే వున్నాను.

కన—నా కళ్ళఎదట నిన్ను పెళ్ళికూతుర్ని చేసి వేరొకరికి చూపటం నేను భరించలేకపోయాను.

రాజ్యం—మరి నేను-ముళ్ళమీద కూర్చునట్లే కూర్చున్నాను. నీకేం! నువ్వు అదృష్టవంతుడివి. వీల్లేదనగానే తుంచుకు పోయావ్. నేనో - ఎట్లా తుంచుకుపోగలను? తుంచుకు పోతే ఎట్లా బ్రతకగలను! ఇది సహించావు, సహం బ్రతుకు. తినబుద్ధి పుట్టదు. తినక తప్పదు. దుఃఖం పొంగి వస్తుంది - దుఃఖంచకూడదు. మానాన్న అన్న నన్ను అన్ని భోగభాగ్యాలతో ముంచెత్తుతున్నారు. ఒంటినిండా నగలు నింపేశారు, కాని హృదయాన్ని దేంతో నింపగలరు? వంటిమీద యీనగలు ఎంతబరువో, ఎంత బాధగా వున్నాయో నీకు తెలీదు బావా...మరే! నువ్వు చూడలేక పోయావ్; నేను భరించలేకపోయాను.

కన—రాజ్యం!

రాజ్యం—నేను నీదాన్ని, నువ్వు నావాడివి. మనిద్దరం వకటే. కాని యిద్దరం వ్యక్తులం. ఒక ఆత్మ. రెండు శరీరాలు. ఒకేరథం. రెండు గుఱ్ఱాలు. ఒకేబాధ, రెండుపద్ధతులు.

కన—రాజ్యం! ఒక్క మాట.

రాజ్యం—ఏమిటది? ఈహృదయం ఖాళీయేగా! ఎన్ని మాటలనైనా భరించగలదు.

కన—మనిద్దర్ని విడదీసి రెండు జైళ్ళల్లో పడేశారు. ఇద్దరి మధ్య పెద్దగోడ కట్టారు. ఈ అభ్యంతరాల నధిగమించి మనం కలిసిపోలేమా?

రాజ్యం—అధిగమించగలిగిన అభ్యంతరాలయితే నాఅభ్యంతరం వుండదు. కాని 'అధిగమించగల్గిందేనా' అని.

కన—ఎందుకు కాదు?

రాజ్య—అధిగమించి భరించగలమా?

కన—ఎందుకు భరించలేం? నాతండ్రి, నీతండ్రి, ఏ సహాయం చెయ్యకపోయినా ఫర్వాలేదు. అమృతం తెచ్చి ఆరగించలేకపోయినా కన్నీళ్ళతోనైనా నాకడుపు నింపుకోలేకపోం.

రాజ్యం—నీతోవుంటే నాకన్నీ వున్నట్టే బావా!

కన—అయితే ఎప్పుడు?

రాజ్యం—ఇప్పుడా?

కన—పోనీ త్వరలో?

రాజ్యం—అలాగే.

కన—నిజంగానా – ప్రమాణం చెయ్యి.

రాజ్య—(చేతిలో చెయ్యి వేస్తుంది)
కన—రాజ్యం!
మాధ—(వచ్చి) ఆ. ఆ. ఆగండి. Pose చాలా బాగుంది. కదిలిపోయారేం. ఛ. ఛ. ఒక్కసారి. ఆ – మళ్ళీ అదే పోజులోకి రావాలి త్వరగా.

(అదే Pose లోకి రాజ్యం కనకం వస్తారు)

రాజ్య—(మళ్ళీ కదలిపోయి) ఆగరా అన్నయ్యా!
మాధ—అహాహా. కదలకు. నేను అహ అంటే అహాయే.

[వాళ్ళిద్దరూ మళ్ళీ Pose లోకి వస్తారు; ఇంతలో కోదండం వస్తాడు]

కోద—అదేమిట్రా...Photo –ఈ Pose ఏమిటి, యీ Photo లేమిటి? ఏడిశావ్! ఆగు.
మాధ—ఎందుకు?
కోదం—ఎందుకా. ఇంకా మే మందరం బ్రతికే వున్నాం. కాబట్టి చచ్చిన తర్వాత ఎవ్వరికోసం ఎవరూ ఆగఖ్ఖర్లే.
మాధ—అదికాదు నాన్నా!
కోదం—ఏది కాదురా. నువ్వు చేస్తున్న నిర్వాకం చాలు. ఇక నోరు మూసుకుని నడు.
మాధ—వాళ్ళిద్దరికి యిష్టమయితే నువ్వెందుకు అడ్డొస్తావ్ మధ్య?
కోదం—ఎవరికి అడ్డు రావాలో, ఎవరికి అడ్డు రానఖ్ఖర లేదో నాకు బాగా తెల్సు. అసలింత వరకు వీణ్ణిక్కడికి రానివ్వటం వచ్చింది.

మాధ—అదేమిటి?

కోద—కాదూ విషయం తెల్సిన తర్వాతగూడా. అయిన వాడని యింట్లోకి రానిస్తే, పెళ్ళికాని పిల్లతో యీ సరసాలేమిటి, నువ్వూ వాళ్ళతో చేరి యీ పోటాలేమిటి?

మాధ—నాన్నా!

కోదం—నాన్న ఏమిటోయ్ నాన్న, ఇక మీ ఆటలు కట్టిపెట్టాలి. నా యింట్లో యిట్లాంటి అపభ్రంశపు పనులు జరగటానికి వీల్లేదు. ఒరే కనకం చెప్తున్నా విను. నువ్వింక యిక్కడికి రావటానికి వీల్లేదు. రాజ్యంతో మాట్లాడటానికి వీల్లేదు. ఈ పిచ్చి వేషాలు యిక సాగవు. నువ్విక్కడికి వచ్చినట్లుగాని, మాట్లాడినట్లుగాని చూశానా జాగ్రత్త!

మాధ—నాన్నా! ఎందుకని వూరుకుంటున్నాను. ఇది నీ యిల్లు. నా యిల్లు గూడా.

కోదం—నీ యిల్లా!

మాధ—ఆ. ఈయిల్లు నాది. యీ ఆస్తి నాది.

కోదం—ఏడిశావ్! నే కష్టపడి...

మాధ—నువ్వేం కష్టపడి సంపాదించలే. నీ యిల్లు ఆపాతది ఇది మా అమ్మది. చచ్చిపోయిన మీ పెద్దనాన్నకొడుకు ఆస్తికి వారసుణ్ణి నేను.

కన—ఆగరా - నా కోసం మీరిద్దరూ ఎందుకు దెబ్బలాడుకుంటారు? నే వస్తా - వెళ్ళొస్తా మామయ్యా!

కోదం—ఊఁ

(కనకం వెళ్తాడు. రాజ్యం దుఃఖంతో వెళ్ళిపోతుంది)

కోదం—ఓ - ఇంతవరకూ వచ్చిందన్నమాట.

మాధ—ఏమిటి నాన్నా నువ్వు కూడ? వాళ్ళిద్దరికి పెళ్ళి చేయటానికి నీకేమిటి అభ్యంతరం?

కోదం—అభ్యంతరం పెట్టింది నేనా మొదట ?

మాధ—కాని మళ్ళీ మామయ్యే వచ్చి అడిగాడుగా.

కోదం—అడిగాడు. కాని, ఎప్పుడు ? ఆ స్తి పోయింతరువాత వాళ్ళకు మొదట నేనక్ఖర్లేక పోయిన కారణాం వల్లనే యిప్పుడు నాకూ వాళ్ళక్ఖర్లేదు.

మాధ—అయితే యీ పట్టుదలలే ప్రధానమన్నమాట. మీ పట్టుదలలవల్ల మనసున్న మనువు నొదిలేసి వీళ్ళిద్దర్నీ బాధపెడతావన్నమాట. అంతేగా?

కోదం—ఆ మాటకొస్తే అంతే.

మాధ—అంతేనా? ఆలోచించు నువ్వుగూడా. రాజ్యం సుఖం కోరితే నువ్విట్లా అనవ్.

కోదం—ఆ.

మాధ—రాజ్యం గొంతు కోయదలిస్తేనే వేరే సంబంధం ఆలోచించు.

కోదం—ఆ...వీటికేంలే.

మాధ—అది ఏ నూతిలోనో పడితే తెలుస్తుంది.

కోధం—ఏడిసింది,

మాధ——వేళాకోళం అనుకుంటున్నావా ?

కోదం——నువ్వు నిజం అంటావా?

మాధ——అయితే ఆ రోజు వచ్చేదాకా కాచుకుకూర్చో. ఉన్నది ముగ్గురం. ఇంత సిరి సంపదలతో వున్నాం. ఇల్లా వకరి నొకరం కష్టపెట్టుకుంటే భగవంతుడు తిన్నగా చూసిన రోజుల్ని గూడ చేతులార పాడుచేసుకున్నవాళ్ళ మవుతాం.

కోదం——ఏడిశావులే – యీ వేదాంతాని కేమొచ్చిందిలే.

మాధ——ఆ. అంతే – డబ్బు కళ్ళు కప్పేస్తుంది.

కోదం——నువ్వు నాకు నీతులు బోధిస్తున్నావా?

మాధ——తప్పు చేస్తుంటే పెద్దరిక మేమిటి ?

కోదం——నీ తప్పులు నువ్వు దిద్దుకో ముందు.

మాధ——అంటే ?

కోదం——అంటే నీకూ – నాకూ – వంశానికీ అప్రతిష్ట తెచ్చే ప్రేమ ప్రసంగాలు కట్టిపెట్టు.

మాధ——.....(మాట్లాడడు)

కోదం——ఇప్పుడొచ్చిన సంబంధం. నీ వల్లనే తప్పిపోయింది. ఇల్లాగే మరో రెండు సంబంధాలు తప్పిపోతే అప్పుడు రాజ్యాన్ని కనకమే కాదంటాడుకూడ.

మాధ——.....

కోధం——నా కళ్లు మూసుకుపోయా యన్నావే. ఆ మాట నిజమే. కాని యివ్వాళే కళ్ళు తెరుపులు పడ్డాయ్.

ఇక యీా ఆస్తి నీది. ఇక నీకూ నాకూ వున్న ఋణం
బ్రతికినన్నాళ్ళూ రెండు పూటలా గుప్పెడు మెతుకులు.
దయ వుంటే వాటికి లోపం చెయ్యకు.

మాధ—నాన్నా -

కోదం—అంతేగాదురా - నువ్వనే మాటకు అర్థం! మీారూ
పెద్దవాళ్ళయినారు. మేం చెప్పటం మీారు వినటం
అంటూ వుంటేగా. మీారనే మాటే సాగనివ్వనియ్యి.

(Peon వచ్చి కాగితం యిస్తాడు)

కోదం—(కాగితం చదువుతాడు)

మాధ—ఏటమిది?

కోదం—మన పెద్దగుమాస్తా బొంబాయి వెళ్ళాడుగదూ.

మాధ—ఆ.

కోదం—వెళ్తూ - Ship Book చేసుకొస్తానని లక్షరూపా
యలుకూడా తీసుకెళ్ళాడు వారం రోజుల క్రిందట. కాని
వాడింకా బొంబాయి చేరలేదటలే.

మాధ—ఏమిటి ?

కోదం—వాడు సంసారంతో గూడ వెళ్ళాట్ట.

మాధ—సంసారంతో గూడానా !

కోదం—అవును.

మాధ—అయితే యికరాడా!

కోదం—ఇంకేం వస్తాడు ?

మాధ—లక్షరూపాయలు!

కోదం—లక్షరూపాయలు (నవ్వుతాడు)

నౌకరు ఉత్తరాలు తెస్తాడు)

కోదం—ఏమిటది...రిజిష్టరుడు ఉత్తరం - (తీసుకు చదివి) మీ పెద్దనాన్న కొడుకు వుంచుకున్నదాని కొడుకు ఉత్తరం రాశాడు, ఆస్తి అంతా తనదేనని— తనే వారసుడనీ... (పెద్దగా నవ్వుతాడు)

మాధ—ఏందుకు నవ్వుతావ్ ?

కోదం—నడిమంత్రపు సిరి పోతున్నదిగదా అని. (మళ్ళీ నవ్వాడు)

మాధ—ఉంటే ఉంటుంది పోతే పోతుంది. కాని నవ్వుతా వెందుకు ?

కోదం—ఎటువచ్చింది - అటు పోతుందిగదా అని.

మాధ—ఉన్నదే వుంటుంది - మరేం ఫరవాలేదు.

(Telegraph Peon వస్తాడు)

మాధ—ఏమిటది.

కోదం—Telegram.

మాధ—ఏమని (తీసుకుని చదువుతాడు)

కోదం—ఏమని......ఏమని...ఎమని చెప్పవేం.

మాధ—మనం సరుకు పంపిన ఓడ మునిగిపోయిందిట.

కోదం—ఆ.

మాధ—రెండులక్షలున్నర నష్టం.

కోదం—2½ లక్షలు, 2½ లక్షలు (నవ్వుతాడు)

మాధ—నాన్నా.

కోదం—నాకు తెలుసు. బంట్లు ఓడ్లైతే - ఓడలు బళ్ళు గావ్వూ. (నవ్వుతాడు)

మాధ—చాలింక వూరుకో.

కోదం—ఎందుకు! ఎందుకు వూరుకోవాలి? ఈ ఆస్తి వచ్చిన నాడూ నవ్వానూ. అంతా పోయిన నాడూ నవ్వుతాను.

మాధ—అదేమిటి?

కోదం—నువ్వెవరు నన్ను వద్దనటానికి.

మాధ—(కోపంతో) నేనెవర్నా!...ఎవర్నా! (Peon వచ్చి ఉత్తరం యిస్తాడు)

కోదం—ఏమిటది?

మాధ—(చింపి చదువుతూ) Income Tax. 50 వేలు, 50 వేలు, 50 వేలు కట్టాలి. ఎక్కణ్ణించి తేను?

కోదం—తెచ్చికట్టూ, కార్లు, వ్యాన్లూ, అన్నీ అమ్మి తెచ్చి కట్టూ.

మాధ—అన్నీ! అన్ని అమ్మితే నేను మిగుల్తాను.

కోదం—రాజ్యం నేనూకూడా మిగుల్తాం.

మాధ—ఓ...ఇక నేను వక బికారినా!!

కోదం—బికారులు బైరాగులు నయం. అడుక్కు తినగలరు. మనకదీ చేతకాదు. అయింది. నేననుకున్నంతా అయింది. కావల్సింది అయ్యింది.

మాధ—ఇక అడుక్కు తినటమే మిగిలింది. ఇంకేం పదండి. అంతా పదండి అడుక్కుతింటానికి.

గోదం—నువ్వు తెచ్చిపెట్టలేనంటే అల్లాగే. నువ్వు ముందు బయల్దేరు. నీవెనుక నేను, నావెనుక రాజ్యం - పదండి- అందరూ పదండి. జోలెలు బుజాన వేసుకుని దిక్కులేని వాళ్ళమమ్మా యింత అన్నం పెట్టండి! గతిలేనివాళ్ళ మమ్మా యింత గంజిపోయండి.

(అంటూ అభినయిస్తూ వెఱ్ఱిగానవ్వుతూ లోపలి కెళ్ళాడు)

మాధ —ఏమిటిది పిచ్చా - వేళాకోళమా?

శ్యామ—(గోడమీదనుంచి) రెండూకలసిన కచ్ఛ.

మాధ—నువ్వింకా యిక్కడే వున్నావా?

శ్యామ—నేనెప్పుడూ నిన్ను కనిపెట్టుకునే వున్నాగా. ఉన్నా. అన్నీ విన్నా.

మాధ—విన్నావా? అయితే నా సర్వనాశనం ఎలా ప్రారంభ మైందో విన్నావుగా. ఇక నేను పరమదరిద్రుణ్ణి. ఇక దరిద్రం అనుభవించాలిగాబోలు.

శ్యామ—ఐశ్వర్యం అనుభవించినతరువాత దరిద్రం అనుభ వించటం కష్టమే. కాని సుఖపడాలనే కోరిక తీవ్రంగావుంటే మార్గాలు దొరక్కపోతాయా?

మాధ—ఏమిటా మార్గం?

శ్యామ—సుఖపడాలనే గట్టి పట్టుదలతో ప్రయత్నిస్తే మని షికి కావాల్సిన ధనం సంపాదంచుకోలేకపోడు. బహుశా

శాస్త్ర కాఠిన్యం అవసరమేమో. అదిసరే - రాజ్యం కనకంతో వంటినిండా సొమ్ముతో యింట్లోంచి వెళ్ళబోతోంది. పో - చూడు.

మాధ—రాజ్యమా!

శ్యామ—ఆ. కనకంతో...

మాధ—కనకంతోనా...రాజ్యం (అంటూ గబగబ లోపలికెళ్ళాడు. శ్యామల గోడ దిగపోతుంది కొంతసేపటికి రాజ్యంతో వచ్చి) మాధవం.

మాధ—ఏంపనే యిది?

రాజ్యం—అన్నయ్యా! (దుఃఖిస్తూ కూర్చుంటుంది)

—: తెర :—

---

## మూడవ రంగము

[అదే రంగం—తెర ఎత్తేసరికి రంగమంతా అలంకార రహితంగా కనిపిస్తూంటుంది. తోటంతా ఎండి పోయింది. వసారాగూడా పడిపోయింది. రాజ్యంసోఫామీద విచారంగా కూర్చుని వుంది. కోదండం ప్రవేశిస్తాడు. రాజ్యాన్ని చూశి దగ్గర కెళ్తూ]

కోదం.—ఇక్కడ కూర్చున్నావేమే వంటరిగా? అదేమిటి కన్నీళ్ళా! హు, కన్నీళ్ళు, ఏడుపులు. ఏడు. ఏడవటాని కే పుట్టింది మీరంతా అంతా. కలిసి ఏడవండి. సుఖపడ మని లక్షలు చేతిలో పెట్టాను. లక్షాధికారులు ఇవ్వాళ భిక్షాధికారులయ్యారు. ముష్టెత్తుకుని బతికినాసరే, వస్తుండి చచ్చినా సరే. లే, ఇక్కడ కూర్చుంటే ఆ వంట ఎవడు చేస్తాడు. కూర్చుంటే పనులయ్యే రోజులు ఎప్పుడో పోయినయ్. నీటుగా చీరకట్టుకుని గోటుగా కూర్చుండే రాత వుండద్దూ. లే - వున్నదేదో వండి తగలెయ్యి. మాట్లాడవేమే - ముద్దులాగ? (రాజ్యం లేస్తుంది) ఆగు వాడేడి?

రాజ్యం.—ఎవరూ?

కోదం.—ఇంకెవరూ? మన దౌర్భాగ్యుడు.

రాజ్యం.—అన్నయ్యా?

కోదం.—ఆ.

రాజ్యం—ఏమో!
కోదం—ఏమొ – ఏమొ – అన్నింటికి పోగయ్యారు నిర్భాగ్య దామోదరులు.

[పరంధామయ్య వస్తాడు]

పరం—ఇక్కడున్నారా బావగారూ!
కోదం—ఆ. ఇక్కడే తగలడ్డాం. ఏం పొద్దున్నే వచ్చారు? వేళకొస్తే వుంటుందో వుండదోనని వారం చెప్పి పోనటానికి వచ్చారా.
పరం—అహహా.
కోదం—వెనకటి రోజులు కావయ్యోయ్. ఇప్పుడు దినదిన గండం. తెలుసా?
పరం—ఆ. ఈ బీదరుపులకేం బావా! నేను గుంటూరునుంచి వస్తూ దిగాలే. భోజనంభోగరాజుగారి యింట్లో. అక్కడే మన మకాం కూడ.
కోదం—నేనా మాట అనుకుంటూనే వున్నా. అయితేయిట్లా వచ్చావేం?
పరం—వచ్చినపని ఖచ్చితంగా చెప్పాలంటే మాధవంతో మాట్లాడటానికి వచ్చాను.
కోదం—ఏమిటా మాటలు.
పరం—హుహుహూ. ఏమిటంటే ఎట్లా చెప్పటం? వాడు కూడ వస్తే వుమ్మడిగా మాట్లాడవచ్చు. యీ మాటను

రాజ్యం పెళ్ళి విషయం అనుకుంటున్నావేమో... అవి మాత్రం కావు.

కోదం——మరి నాకు కూడ తెలియవల్సినవి కావన్నమాట.

పరం——అహాహా. నీకు తెలియకుండాఎట్లా? మీరిద్దరూ సంప్రదించుకుని తేల్చవల్సినదే.

కోదం——అయితే తేల్చి చెప్పరాదూ?

పర——అహాహా! మరేం లేదు. మొన్న నీ మధ్య మాధవం యీ యింటిని అమ్మ చూపాడని విన్నాను.

కోదం——ఆ.

పరం——అహాహా. మన భోగరాజుగారే అన్నారు.

కోదం——నాకు తెలియకుండానే అమ్ముతానన్నాడా!

పరం——నీకు తెలుసుననే అనుకున్నా అహాహా. ఇదీ ఆయనకు వినికిడవల్ల తెల్సిందిలే. అందుకని నిజమో! కాదో! మిమ్మల్నడిగి తెల్సుకుందామనీ...

కోదం——నిజమయినా నీకెందుకిది?

పరం——అహాహా – మరేం లేదు – మన కనకానికి మొన్నీ మధ్యనే Bank లో Manager అయింది.

కోదం——అహా.

పరం——Manager అయిం తర్వాత యీ వుద్యోగం బాగానే వుందనిపించింది నాకు.

కోదం——అయితే......

పరం——ఎల్లాగా వాడీ వూళ్లో వుండవలసినవాడే గదాఅని–

కోదం—అని...?

పరం—అని మీరీయిల్లు అమ్మితే నేనే కొందామని. వాడి కెట్లాగూ ఒక యిల్లు కావాలిగా యీ వూళ్లో?

కోదం—ఇది అమ్మటం, నువ్వు కొనటమూనా?

పరం—అహాహా - అమ్మితేనే కొనటం.

కోదం—యిల్లు అమ్మటందాకా వచ్చిందీ. ఇది అమ్మటం విషయం నాతో ఎప్పుడూ అనలేదే మాధవం!

పరం—ఆ. నీతో అనటం ఎందుకూ అని అనలేదేమో -

కోదం—నాతో అనటం ఎందుకా - నాతో కాకపోతే మరెవరితో అంటాడు?

పరం—అహాహా - ఎవరితోనైనా అనటానికి ఏముంది? ఈ యిల్లు వాడిదాయె.

కోదం—వాడిదీ!

పరం—కాదూమరి. వాడి తల్లి ఆస్తి కాదూ యీ యిల్లూ!

కోదం—అయితే మాత్రం! నాతో చెప్పక్కర్లేదే?

పర—అహాహా. చెప్పక్కర్లేదుగా.

కోదం—చెప్పక్కర్లే. చెప్పకుండా ఎల్లా అమ్ముతాడో, నువ్వెట్లా కొంటావో చూస్తాగా.

పర—ఉహుహూ. కోప్పడకు. నీ కొడుకు అన్న మాటయిది. నువ్వు కాదంటే నే చేసేదేముంది? మాధవం మాత్రం ఏం చేస్తాడు?

మాధ—(వస్తూ) ఏమిటి కాదనేది!

పరం—ఈ యిల్లు అమ్మేతావని భోగరాజుగారంటేనూ—

మాధ—అవును. అమ్మేతానన్నాను.

పరం—చూశావా?

కోదం—చూశాను.

మాధ—అమ్మేతానంటే! ఏం జరిగిం దిప్పుడు?

పర—అమ్మితే నేనే కొందామనుకున్నాన్లే.

మాధ—నువ్వా!

పరం—సరేలే ఇవ్వన్నీ తర్వాత మాట్లాడుకుందాం. రాజ్యం పెళ్ళెప్పుడు చేస్తారూ?

కోదం—నే చచ్చినప్పుడు!

పరం—అహాహా! అదేమిటి! అల్లా అంటావ్!

మాధ—అంతే! చచ్చినప్పుడే! చస్తే అందరి పీడా వదుల్తుంది.

కోదం—ఆ క్షణంకోసం కాచుకు కూర్చున్నావా? అయితే నీకు ఆశాభంగమే!

మాధ—ఆశాభంగమే! చచ్చైనా సుఖపెట్టవు నన్ను.

పరం—ఏమిట్రా - ఎప్పుడూ లేంది – ఇల్లా మాటలు మీరి పోతున్నారు! మీ యిద్దరికి పడదా ఏం?

కోదం—ఆ! ఆ! పడటంలే. కనపడటంలే కారుకూతలు!

పరం—బాగుంది.

కోదం—బాగానే వుంటుంది. తండ్రీ కొడుకు పోట్లాడుకుంటుంటే కళ్ళారా చూట్టానికి – బాగానే వుంటుంది,

(కోదండం కోపంగా వెళ్ళిపోతాడు)

మాధ—మామయ్యా!

పరం—ఏమిట్రా యిది?

మాధ—ఆయనంతేలే. నీకు తెలుసుగా! మా పరిస్థితి చితికి పోయింది. వచ్చినదంతా ముచ్చట పడినంతసేపు నిలవ లేదు. నమ్ముతావో - నమ్మవోగాని పచ్చడి మెతుకులు కూడా వేళకుండటంలేదు. బయటికి చెప్పుకోటానికి వీల్లేదు. చెప్పినా నమ్మరు. ఈ పరిస్థితుల్లో వున్న రెండెకరాల్నీ అమ్మేసి ఏ పరాయి వూళ్ళోనైనా నెమ్మదిగా కాలం గడపాలని వుంది. పాలమ్మిన చోటే నీళ్లు అమ్మలేంగా!

పర—అది బాగానే వుంది.

మాధ—అవునా? - అదే మాట ఆయన అనడు. మాట మాట్లాడితే ఆస్తి పోగొట్టింది నేనని ఆడిపోస్తాడు. అదే మిటి అంటే కోపం. నేను మాత్రం ఏం చేస్తాను చెప్పు-అదృష్టం లేకపోతే!

పరం—ఏం చేస్తావులే...

మాధ—నేనేం తెలివితక్కువతనంతో ఆస్తి పోగొట్టానా?

పరం—అహాహా! అని ఎవరనగిలరులే - ఎదటపడి.

మాధ—పోయిందెప్పుడూ తిరిగి రాదుగదా. కనకనే వున్న దాంతో ఎట్లాగయినా తంటాలుపడదామంటే వినడు.

పరం—వినక ఏమంటాడూ?

మాధ—ఉన్నదాన్ని అమ్మి చిన్న వ్యాపారం ఏదో చేద్దామంటే వద్దుగాక వద్దంటాడు.

పరం—ఎట్లామరి!

మాధ—ఎట్లాగో అదీ చెప్పడు. ప్రతిదానికి నన్ను తిట్టటం తప్ప ఏమీ చెయ్యడు. చెయ్యటం చేతకాకపోతే వూరుకోడు.

పరం—అహాహా! ఇదేం బాపుంఠ లేదురా!

మాధ—అందరికి సుఖపడాలనే వుంటుంది. బాగుపడి పైకి రావాలనే వుంటుంది. నాశాయశక్తులా తగిలిన దెబ్బకు తట్టుకోవాలనే ప్రయత్నిస్తున్నా. తనూ చూస్తూనే వున్నాడు. ఇట్లాంటప్పుడు తనెట్లా వుండాలి?

పరం—జాగ్రత్తగా వుండద్దూ!

మాధ—చేసినదేదీ కలిసిరాక నానా అగచాట్లూ నేను పడుతుంటే యింటికిరాగానే కాస్త సానుభూతన్నా చూపాలా!

పరం—వద్దూమరి!

మాధ—అందుకనే నేనూ ఆలోచించి తేల్చుకున్నాను. ఏమైనాగానీ, ఏపనైనా చెయ్యనీ నేను, నా సుఖం, నా స్వలాభం తప్ప వేరేం ఆలోచించటంలేదు. అందరికీ వున్నట్లే నాకూ జీవితాన్ని బాగుచేసుకోవాలనుంది. నా బాగుకు ఎవరడ్డొచ్చినా పాటించేదిలేదు! లక్ష్యపెట్టేది లేదు - అది తండ్రేకానీ - చెల్లెలేకానీ.

పరం—దాంట్లోనూ అర్థం లేకపోలేదు.

మాధ— నే బాగుపడాలి. పైకిరావాలి. అది ఏవిధంగానైనా సరే. అన్యాయం అని ఆగిపోను. స్వార్థం అని వెనక్కు తియ్యను. అసత్యమని ఆలోచించను. నాలత్యం వక్కటే ఎలాగైనా డబ్బుసంపాదించాలి. ఎలాగైనా ధనవంతుణ్ణవాలి. ఎలాగైనాసరే.

పరం— ఉహుహు.

మాధ—ప్రపంచంలో సాధారణంగా అందరూ అసహ్యించుకొనేవి, నీచకార్యాలనబడేవి చాలావున్నై! వాటినిచూచి యిన్నాళ్ళు నేనూ అసహ్యించుకొన్నా. కాని పొరపాటు పడ్డాను. అలా అసహ్యించుకోబట్టే యీనాడు యిలా అయ్యాను. ఒక్క నీచపుపనితో బాగుపడ్డవాళ్ళు చాలా మంది వున్నారు. ఆచరణలో ఏ నీచానికి దిగవలసి వచ్చినా యిక వెనక్కి తియ్యను. నాకు అవకాశం దొరికితే ఏ నీచమార్గాన్నైనా వినియోగించుకుంటాను.

పరం—అహాహా. అంతే. అంతే. నీకిప్పుడు 25 ఏండ్లు కాదూ? నేనిప్పుడు 25 ఏండ్ల క్రిందటిసంగతి చెప్పబోతున్నాను. అప్పటికి నువ్వింకా పుట్టలే. కనకం పుట్టలేదూ ... అప్పుడు నాకు 25 ఏండ్లు. చాలా బీదవాణ్ణి. బీదవాణ్ణి నేనొక్కణ్ణేకాదనుకో; మీనాన్నకూ అప్పుడు ఏంలేదు — ఆ పాతయిల్లు — రెండు ఎకరాల పొలంతప్ప — నాకదీ లేదు. నేను 3rd Form Fail అయి ఒక వ్యాపారస్తుడి

దగ్గర 30 రూ॥కి గుమాస్తాగా చేరాను. మూడు ఏళ్ళు 30 రూ॥తో నానా అవస్థలు పడ్డాను. ఎందుకు పడ్డానో తెల్సా!

మాధ—ఎందుకు?

పరం—నువ్వు చెప్పిన యీ ఆదర్శాలు, అనుమానాలూ పట్టుకు వదలక. ఒకనాడు నీలాగే బాధపడి చివరికి దొరికిన అవకాశం ఉపయోగించుకున్నా. చేరదీసి వుద్యోగ మిచ్చిన వ్యాపారస్తుణ్ణి పూర్తిగా దివాలా కొట్టించాను. అతన్నీ, అతని వ్యాపారాన్నీ, వదిలేసి నేనదే వ్యాపారం అతనికే పోటీగా మొదలెట్టాను. ఎంత మోసం, అన్యాయం చెయ్యగలనో అంతా చేశాను. ఫలితం... నేను లక్షలు - లక్షలు సంపాదించ గలిగాను. తరువాత సంపాదించటమేముందిలే. అంతా సంపాదిస్తారు. కాని, యీ దరిద్రానికీ, సౌభాగ్యానికీ మధ్య వకటి జరిగింది. ఎవడు నన్ను చేరదీసి పోషించాడో వాడే వకరోజు వచ్చి నన్ను రేటు తగ్గించవద్దని, తగ్గిస్తే తను నాశనమైపోతాడని అడిగాడు. నాకు ఒక్కటే సమస్య అయిపోయింది. తగ్గిస్తే అతను నాశనమై పోతాడు. నాకు పెద్ద లాభం మేం లేదు. నాకు వ్యాపారంలో ప్రత్యర్థి లేకుండా పోతాడు. నేను నా స్వార్థాన్నే కోరుకున్నా. అతను తిండికి లేకుండా పోయాడు.

మాధ—అహా.

పర——ఇక అహం ఏముంది. మనకున్నవి రెండే అభ్యాయి! ఇహాం - పరం. మన కళ్ళకు కట్టినట్లు కనిపించేది ఇహాం! ఉందో లేదో కూడ తెలియనిది పరం. ఈ యిహాంలో- యిక్కడ - నానా బాధలు పడి ఎక్కడో పరంలో సుఖ పడే బదులు ఇక్కడే సుఖపడి అక్కడే కష్టపడదాం.

మాధ——నువ్వనేది నిజమే ననుకుంటాను. మామయ్యా!

పర——అభ్యాయ్! ఆదర్శాలన్ని చాలా బాగుంటాయి - వింటానికి. ఆచరించాలనే కుతూహలం ప్రతివాడికీ వుం టుంది. త్యాగం, స్వార్థం, ప్రేమ ఇల్లాంటి ఆదర్శాలన్ని నాకూ బాగానే నచ్చుతాయి. నేను తప్ప యితరు లెవరైనా యీ సద్గుణ సంపత్తితో ప్రవర్తిస్తే చూశి సంతోషించటంలో నేనేం లోపం చెయ్యాను. గాంధీగారే వున్నారనుకో. ఆయన్ని చూస్తే ఎంత ఆనందం! కాని నన్నూ గాంధీగారవమంటే!- అక్కడే వస్తుంది చిక్కు! ఈ ప్రపంచంలో తను పడుతున్న అవస్థలో గాంధీగారు ఆనందించగల్గాడేమొ, ఆ అవస్థల్లో ఆ అవస్థలన్ని నేనూ పడగలనుకాని ఆ అవస్థలో సంతోషించటం నాచేత కాదు.

మాధ——నాక్కూడ చేతకావటం లేదు.

పరం——స్వార్థంతో ప్రవర్తించటం చాలా కష్టమైన పని. మనస్సును రాయి చేసుకోవాలి. దయా దాక్షిణ్యాలు వదిలేయాలి. ఒక్కొక్కప్పుడు మనసు మైనం లాగ కరిగి పోతుంది. కాని అప్పుడే మనం జాగ్రత్తగా వుండాల్సింది.

మనస్సు చలించకుండా బిగబట్టి ఎంత కఠినమైనపనైనా చెయ్యాలి. ఈ కార్య దీక్షతో మనం పని చేస్తే కావల్సింది సాధించవచ్చు, కావల్సినంతా సంపాదించవచ్చు.

మాధ—అవును. సుఖపడాలంటే క్రూరకార్యాలుకూడ చెయ్యవలసి వస్తుంది. సుఖపడటం ప్రపంచంలో క్రూరత్వానికే చేతనవును. ఆ...ఆ (ఖంగారు పడతాడు)

పర—ఏమిటది?

మాధ—ఈ మాట యిదివరకెవరో నాతో అన్నారు.

పర—ఎవరూ ?

మాధ—ఎవరా! ఎవరంటే - ఎవరబ్బా! - ఎవరోలే! కాని అది నిజమే. సుఖపడటం ప్రపంచంలో క్రూరత్వానికే చేతనవును.

పర—ఎవరంటూరు యీ మాట! తన సుఖంకోసం ఎంత క్రూరానికి దిగినవాడైనా - ఎన్ని హత్యలు చేయగల్గిన వాడయినా - యీ మాట మాత్రం పైకి అనలేడు.

మాధ—కాదు - ఎవరో అన్నారు.

పర—అనరు. ఒకవేళ అంటే, వాళ్ళెవరో నీ శ్రేయస్సే తన శ్రేయస్సుగాను, నీ స్వార్థమే తన స్వార్థంగా భావించే వాళ్ళయివుండాలి. అంటే తన స్వార్థంకోసం నీస్వార్థాన్ని పురికొల్పుతున్న వాళ్ళన్నమాట.

మాధ—ఆ!

పర—లేదా! నీ అంతరాత్మే అన్నదేమొ! జ్ఞాపకం తెచ్చుకో? ఒక్కొక్కప్పుడు అంతరాత్మ యిట్లాంటి అమూల్యమైన సందేశాలిస్తూంటుంది.

మాధ—బహుశా నా అంతరాత్మేనేమొ! ఏదైనా రింగులు తిరిగి పోతూన్న నామనసు, కాస్త నిశ్చలమయింది.

పర—అయితే మరి, ఇల్లు అమ్మతానన్నమాట నిజమేనా?

మాధ—అమ్మాల్సేవస్తుంది? నేనీవూరినుంచి వెళ్ళిపోవాలి. ఇక్కడ తలెత్తుకుని తిరగలేను. అందుకే యిల్లు అమ్మేయాలని వుంది.

పర—అయితే నాకు తెలీకుండా అమ్మకు. ఒకరికి అమ్మేది, నాకే అమ్ముదువుగాని. మరి మీనాన్న వొప్పుకుంటాడా?

మాధ—ఆయన ఒప్పుకునేదేమిటి? ఈయిల్లు మా అమ్మది, అంటే నాది. ఆయనదేముంది?

పర—అహాహ ... ఆసంగతి ఆయన ఆలోచించటం లేదులే!

మాధ—ఆయన ఆలోచనల్లే యిందాకా తెచ్చాయి.

పర—సరే! మరి - నేవస్తాను. ఎప్పుడన్నా కనకం కనిపిస్తున్నాడా.

మాధ—లేదు. కనిపించి నాలుగయిదు నెలలయింది.

పర—వాడి వ్యవహారంకూడా కాస్త చూద్దూ.

మాధ—ఏంచూడను?

పర—రాజ్యాన్ని మీరివ్వనన్నారుగదా - ఇక యిప్పటికీ వాడిమనసు మార్చుకుని మళ్ళీ నాతో కలిసివుండకపోతే ఎట్లా? వాడు నాకొక్కడే కొడుకుగదా...

మాధ—అలాగే.

పర—మరి నేరానా - వస్తా. అన్నీ ఉత్తరం రాయి. నిమ్మదిగా.

మాధ—సరే.

(పరంధామయ్య వెళ్ళబోతూండగా గోడ అవతల నుంచి జాజిపూల చెండుతో ఒక ఉత్తరం వచ్చి పడుతుంది.)

పర—ఇదేమిటి.

మాధ—ఏం లేదు. గాని......

పర—అహాహా! ఏంలేకపోవటమేమిటి?...ఏదో......

మాధ—ఏంలేదు. సరే - అల్లాగే ఉత్తరం వ్రాస్తాలే.

పర—ఊ! సరే! అయితే వస్తా (పరంధామయ్య వెళ్ళాడు)

మాధ—(గోడవైపుగా చూస్తూ) ఎవరది?

శ్యామ—నేనే (వచ్చి)

మాధ—ఓ - నువ్వు యిక్కడే వున్నావా?

శ్యామ—ఎప్పుడు లేనిక్కడ?

మాధ—అయితే మేం మాట్లాడుతున్నదంతా నువ్వు విన్నావా?

శ్యామ—ఆ - అన్నదంతా ఆచరిస్తావా?

మాధ—ఆ. ఆచరించక తప్పేట్టులేదు.

శ్యామ—బాగా ఆలోచించుకో!

మాధ—సుఖపడటం కూర్రత్వానికే చేతనవును. నాకు కావాల్సింది సుఖం - ధనం - ఇవి సంపాదించాలి... కాని ఎట్లా సంపాదించటం! ఎట్లా! - ఏంచేస్తే వస్తుందా ధనం!

శ్యామ—తేలికమార్గం వకటుంది చేస్తావా?
మాధ—చేస్తాను. ఏమిటది?
శ్యామ—రాజ్యం నగలున్నాయ్, అవి తీసుకో - 25 వేలు చేస్తయ్.
మాధ—రాజ్యంనగలా! అవును. 25 వేలు చేస్తయ్. అవి చాలు - అవిచాలు.
శ్యామ—కాని తొందరపడకు - బాగా ఆలోచించు.
మాధ—ఇంకా ఆలోచనెందుకు? అంతకంటె వేరే మార్గం కనిపించటం లేదు మరి.
శ్యామ—ఆగు. ఒకనాడు రాజ్యంసంగతికంటే నీసంగతే ఆలోచించమన్నాను. ఆనాడు నీస్వార్థంకోసం రాజ్యానికి అడ్డంవెళ్ళలేనన్నావ్.
మాధ—అవును. ఆపాపపుక్షణం ఏనాటికీ రాకుండా భగవంతుణ్ణి ప్రార్థించాను. కాని ఆ పాపపు క్షణం రానే వచ్చింది.
శ్యామ—ఆగు. తొందరపడకుండా ఆలోచించు. నీఆదర్శాలన్నీ వక్కసారి జ్ఞాపకం తెచ్చుకుని ఆలోచించు. సకల సౌఖ్యాలలో ఓలలాడుతున్నప్పుడు ఆదర్శాలు పాటించటంలో విశేషం లేదు. ఈనాడు ఈ ఆశాపాశంలో తగులుకున్నప్పుడే నీ ఆదర్శాలకు పరీక్ష.
మాధ—నా యావత్తు భవిష్యత్తు పెద్ద సమస్యగా ఎదురు నిల్చి వుంది. ఇంకా ఆలోచనెందుకు? నేను రాజ్యం

నగలు తెస్తాను. నువ్వూ నీ నగలన్నీ వెంటతీసుకురా. మరో దూర ప్రాంతానికెళ్ళి మన జీవితాలను పునర్ని ర్మించుకుందాం. ఆలస్యం చెయ్యద్దు - వెళ్ళిరా.

శ్యామ—ఇంత దిగజారిపోతావనుకోలేదు మాధవం. వస్తా.

(శ్యామల గోడ దిగి వెళ్ళింది. మాధవం ఒక్క క్షణం ఆలోచించు)

మాధ—శ్యామలా!

శ్యామ—(లోపల్నించి 'ఆ' అని పలికింది)

మాధ—ఉన్నావా - వెళ్ళావా?

శ్యామ—వెళ్ళబోతూ ఆగా.

మాధ—ఆగు. నీతో మాట్లాడాలి. నే వస్తున్నా.

[శ్యామల వెళ్ళినవైపే తనూ వెళ్ళాడు. కాసేపుండి కనకం రెండో వైపునుంచి దొంగలాగ వచ్చాడు.]

కన—రాజ్యం (నెమ్మదిగా పిలిచాడు రాజ్యం వస్తుంది)

రాజ్యం—(వచ్చి) నువ్వా బావా! ఎట్లా వచ్చావ్!

కన—ముందుగోడ దూకి వచ్చాను.

రాజ్యం—ఎందుకు?

కన—అన్నీ తేల్చుకోటానికే.

రాజ్యం—అంటే.

కన—నన్నిప్పుడు మా Bank లో Manager గా వేశారు,
ఇక నా కాళ్ళమీద నేను నిలువగలను.

రాజ్యం—అవునట.
కన—నువ్వూ పెద్దదానివైనావ్!
రాజ్యం—అయితే?
కన—యింకా... నేనంటే నీకిష్టమేగా?
రాజ్యం—అట్లా అడుగుతావేం బావా!
కన—అయితే నాతో వచ్చెయ్యరాదూ?
రాజ్యం—వచ్చెయ్యనా? ......
కన—ఆ...మాట్లాడవేం - నీకు తెలియదు రాజ్యం - నేనెంత బాధపడుతున్నానో నీ కోసం. మా నాన్నని, ఆస్తినీ వదిలేశి దరిద్రుణ్ణయ్యాను. ఈ ఉద్యోగం దొరికింది. దొరికిన ఉద్యోగంలో కష్టపడి అహోరాత్రాలు పనిచేసి యీ Manager పదవి సంపాదించాను.
రాజ్యం—ఆ.
కన—నీ కోసం కళ్ళవెంట నెత్తురు పడుతున్నా పనిచేశాను. పగలు ప్రొద్దుపోయేదాకా ఆఫీసులో పని, ఇంటికి వచ్చి నీ కోసం పరితాపం. ఇలా ఎడారి జీవితం గడిపాను. ఎన్నిరోజులు నిద్రాహారాలు మర్చిపోయానో దేవుడికే తెలుసు. నేనేదో తెంపుకుపోయి ఘుఖపడుతున్నా ననుకున్నావుకదూ? ఇదీ నా సుఖం.
రాజ్యం—బావా!
కన—ఇప్పుడు మీ వాళ్ళ పనీ చితికిపోయింది. అందుకనీ-
రాజ్యం—వెళ్ళిపోదామంటావా?

కన—ఆ.

రాజ్యం—బావా! (సందేహిస్తుంది)

కన—ఆగావేం? అను - నా ఆశలన్నీ త్రుంచి పోగులు పెట్టావో, ప్రోదిచేసి పోషిస్తావో.

రాజ్యం—పద బావా - వెళ్ళిపోదాంపద.

[కోదండం యింట్లోంచి బయటకు వస్తాడు.]

కోదం—(వస్తూ) నాకు తెలుసును నువ్వామాట' అంటావని! నాకు తెలుసు -యిది ఏనాటో జరగబోతోందని. (రాజ్యం, కనకంభయంతో వెనక్కి- వెనక్కి-నక్కి- వెళ్తారు) రాజ్యాన్ని నీతో రమ్మని ప్రేరేపిస్తున్నావుకదూ కనకం? రాజ్యం! నువ్వేమంటున్నావ్ - పద - పోదాం అంటున్నావ్. నాకు తెలుసు మీరిద్దరూ వెళ్ళిపోతారని, ఇది నేను తెల్సుకుని ఆప లేనని.

రాజ్యం—నాన్నా!

కోదం—కనకంతో నీపెళ్ళి నాకిష్టంలేదని నీకు తెల్సుగ దమ్మా. కాని యిప్పటివరకు లేని ధైర్యం యిప్పుడు వచ్చి 'పద పోదాం' అంటున్నావ్ - నే నొప్పుకుంటున్నాను. నాకేం శక్తిలేదు. మిమ్మల్నిద్దర్నీ నేను ఆపలేను. నేను దరిద్రుణ్ణి; నికృష్టుణ్ణి; నన్నెవరు లక్ష్యపెడతారు యీ ప్రపంచంలో? మీకిద్దరికీ యిష్టమే కాబట్టి మీరు వెళ్ళిపో వచ్చు. ఈపళ్లులేని పెద్దపులినిమీరు లక్ష్యపెట్టనక్కర్లేదు.

రాజ్యం—నాన్నా.

కోదం—కాని జ్ఞాపకముంటే, వీలుంటే, మీనాన్న చచ్చాడా బ్రతికాడా అన్నవిషయం మాత్రం అప్పుడప్పుడు తెలుసుకుంటూవుండు.

రాజ్యం—(కళ్ళనీళ్ళు తిరుగుతాయి.) నాన్నా!

కోదం—దుఃఖమా! ఎందుకు? తండ్రిఅంటే లక్ష్యంలేనివాళ్ళకి ఎందుకు దుఃఖం? ఇది చూస్తే మీ అన్నయ్య నవ్వుతాడు తెలుసా! వెళ్ళవచ్చు. మీరు నిర్భయంగా నిరభ్యంతరంగా వాకిటిదోవన వెళ్ళవచ్చు. మిమ్మల్ని ఆపగల ధైర్యం గాని, సామర్థ్యంగాని, అధికారంగాని నాకిప్పుడులేదు. మీరు వేళకి రెండుమెతుకులువేస్తే తిని బ్రతకవలసిన వాణ్ణి మిమ్మల్ని కాదని నేబ్రతకగలనా. వెళ్ళండి - వెళ్ళిపోండి. వెనకటి వృద్ధవాక్యాలలోవున్న ఆశీర్వాదబలం యిప్పుడులేదు. అందుకని మిమ్మల్ని నేను దీవించను కూడా. కాని - కాని - కాని ఒక్క మనవిమాత్రం వుంది- మనవికాదు - ఒక వేడికోలు - అహా; కాదు - ఒకవిన్నపం. అబ్బే! కాదు _ ఒకభిక్ష; దయాభిక్ష. నీమనసు కరిగితే ప్రసాదించు. అంతే.

రాజ్యం—ఏమిటినాన్నా అది? - ఏమిటిదంతా?

కోదం—నువ్విక్కడే వున్నావుగా! ఇన్నాళ్ళనుంచి చూస్తున్నావుగా మాధవాన్ని?

రాజ్య—ఆ,

కోదం—వా డికమీద నాకు అన్నంపెడతాడన్న ఆశవుంచం టావా – సరీగ్గాచూస్తాడంటావా! వాడికి నేనెంత బరువుగా వున్నానోచూశావా – వాడు కొడుకు–నువ్వుకూతురివి. ఆడవాళ్ళగుండె జాలిగుండె అంటారు. నీకేమన్నా నామీద జాలిమిగిలితే నాకీ ఒక్క భిక్షే పెట్టు.

రాజ్యం—ఏమిటది! ఏమిటిది! ఏమిటదినాన్నా!

కోదం—ఏంలేదు – నీమెళ్ళో హారం–వంటిమీదవున్న నగలు

రాజ్య—ఆ!

కోదం—ఇచ్చివెళ్ళు. బ్రతికినన్నాళ్లు రెండుపూటలా తిండికి మాడిపోకుండానే వుండాలని నీకుంటే వుండటానికి యిచ్చి వెళ్ళు.

రాజ్యం—ఆ.

కోదం—పెంచి పెద్దచేసిన ప్రేమ మిగిలివుంటే కన్నతండ్రి కడుపుకొట్టకు.

రాజ్యం—నేనాసంగతి ఆలోచించలేదు నాన్నా.

కోదం—నువ్వు యివ్వనంటే నే చేసేదేంలేదు. ఏమైనా చేస్తే అన్నయ్యతో చెప్పి యిప్పుడే యింట్లోంచి వెళ్ళగొట్టిస్తావ్.

రాజ్యం—నాన్నా!

కోదం—ఇవి ఇచ్చానని అన్నతో చెప్పకు. చెప్పదలిస్తే యివ్వకు.

రాజ్యం—ఇచ్చేస్తా నాన్నా –అన్నీ యిచ్చేస్తా – నీకే యిచ్చేస్తాను. ఇదిగో హారం – యిదిగో గొలుసు – చంద్ర.

హారం, డైమండ్ నెక్లేసు లోపల అలమారలో వున్నాయి. ఇవిగో గాజులు (తీసి యివ్వబోతూ అనుమానించి) గాజులు - గాజులుకూడ యివ్వనా నాన్నా! (కంట తడి పెడుతుంది)

కోదం—ఇవ్వమ్మా బావ వుద్యోగంలో వున్నాడు. మళ్ళీ అన్నీ చేయిస్తాడు. అవన్నీ మళ్ళీ చేయిస్తాడులే.

రాజ్యం—(గాజులు తీసి యిచ్చి) రా నాన్నా (కోదండం రాజ్యం లోపలికెళ్ళారు. కొంచెంసేపు కనకం ఛంటరిగా వున్నాడు. తరువాత రాజ్యం వస్తుంది)

కన—ఇచ్చేశావా!

రాజ్యం—ఆ

కన—అన్నీ!

రాజ్యం—ఆ, అన్నీ...

కన—రాజ్యం!

రాజ్యం—ఏం?

కన—నిన్ను ఏమనాలో తెలియటం లేదు! నీకేం విచారంగా లేదూ?

రాజ్య—ఎందుకు?

కన—నీకా నగలక్కర్లేదా!

రాజ్యం—అక్కర్లేదు. నువ్వుండగా నాకేమీ అక్కర్లేదు.

కన—నిన్నేమనటానికి తోచటం లేదు రాజ్యం! దేనికీ మాటలు చాలటం లేదు. కాని యీ మాట మాత్రం

అనగలను. నాకెంతో గర్వంగా వుంది నిన్ను చూస్తే. పద పోదాం. (ఇద్దరూ బయటకు వెళ్ళబోతూ)

రాజ్య—అటెక్కడికి

కన—యిటు వెళ్దాం (గోడవైపు చూపిస్తాడు)

రాజ్య—అహా యిటు వెళ్ళచ్చుగా! (ఇంటిలోపలివైపు చూపిస్తుంది)

కన—వద్దు. యిటే పోదాం. అటు మీనాన్న వున్నాడు.

రాజ్యం—యిటు వెళ్ళచ్చు. నాన్న వున్నా వెళ్ళమన్నాడుగా?

కన—అహా! పద మరి.

[మాధవం రెండో వైపునుంచి వస్తాడు.]

మాధ—అటెక్కడికి!

(ఇద్దరూ ఆగారు)

మాధ—అటు నాన్న వున్నాడు.

రాజ్యం—(వెనక్కి తిరిగి చూసి) ఓ...యిటు నువ్వున్నావ్!

కన—పద రాజ్యం! మాధవం! – రాజ్యం నేనూ వెళ్తున్నాంరా!

మాధ—ఎక్కడికి?

కన—ఎక్కడికీ లేదు. రాజ్యం నాతో వచ్చేస్తోంది.

మాధ—అహా. (తెల్లబోతాడు)

కన—అలా అయిపోయ్యాం వేంరా?

మాధ—(నిట్టూర్చి) మరేం లేదు.

కన—అలా అయిపోయూ వేం?- నీకు యిష్టమేగా మా యిద్దరి పెళ్ళి!

మాధ—ఆ - యిష్టమే గాని...

కన—మరి ? సందేహిస్తావేంరా!

మాధ—ఏం లేదు. నీకు తెల్సుగా - మా పరిస్థితులు. నేను సామాన్యంగా వున్నప్పుడూ, అమిత భాగ్యాలతో వున్నప్పుడూ మీ యిద్దరి సంతోషమే కోరాను.

కన—అవును. మరి యిప్పుడు ?

మాధ—ఇప్పుడూ మీ యిద్దరి శ్రేయస్సే కోరుతున్నాను. నేనేమాత్రం సరియైన పరిస్థితుల్లోవున్నా యింత బాధ పడేవాణ్ణి కాదు. కాని.

కన—చెప్పరా - అదేమిటో!

మాధ—మీ యిద్దరి పెళ్ళీ నే ఖర్చుపెట్టి చెయ్యలేను.

కన—ఆ బాధ నీ కేమఖ్ఖర్లేదు. మేము...

మాధ—కాని దురదృష్టంకొద్దీ యింకా మిమ్మల్ని బాధ పెట్టాల్సివస్తుంది.

కన—ఏమిటి?

మాధ—నే నెల్లాగన్నా నిలదొక్కుకుని బాగుపడాలనే నా తాపత్రయం. నా దగ్గర ఏ వ్యాపారం చెయ్యటానికి దమ్మిడీ లేదు. కనక అన్యథా భావించక......రాజ్యాన్ని తన నగలు యిచ్చి వెళ్ళమను.

రాజ్యం—నేనేం తీసుకెళ్ళటంలేదురా అన్నయ్యా! ఈవక్క చీరే. ఇది నువ్వే నాకు ప్రెజెంటు చేశావ్...యిదీ వుంచెయ్యనా పోనీ...

మాధ—దీని సంగతి కాదమ్మా- నగలు - ఎక్కడ పెట్టావ్?

రాజ్యం—నగలా!

మాధ—ఆ...నగలు - నగలు-నగలు-ఇంకా నా చేత అని పించాలా - ఆ మాట?

రాజ్యం—అన్నీ యింట్లోనే వున్నయిరా.

మాధ—ఎక్కడ ?

రాజ్యం—నాన్న దగ్గరే ?

మాధ—నాన్నదగ్గరా !!

రాజ్యం—ఆ - నాన్న - యిప్పుడే అన్నీ తీసుకున్నాడు !

మాధ—ఎం చేసుకుంటాడు ?

రాజ్యం—ఏమొ !

మాధ—ఎందుకు తీసుకున్నాడు ?

రాజ్యం—ఏమొ!

మాధ—ఊఁ !

కన—ఏమంటావురా - వెళ్ళమంటావా?

మాధ—నాన్న ఏడీ !

రాజ్యం—ఎందుకు ?

మాధ—నాన్న ఏడి !

రాజ్యం—లోపలున్నాడు.

మాధ—పిలు !

రాజ్యం—ఎందుకు ?

మాధ—పిలు ముందు.

రాజ్యం—ఎందుకురా?

మాధ—ఎందుకో చూద్దువుగాని - పిలుముందు.

[కోదండం ప్రవేశిస్తాడు)

కోదం—పిలవనక్కర్లే - నేనే వస్తున్నా - ఎందుకు ?

మాధ—రాజ్యం నగలు తీసుకున్నావటగా !

కోదం—అవును. తీసుకున్నాను. ఏం తీసుకుంటే ?

మాధ—ఇచ్చేశెయ్యి. అవ్వి నాకు కావాలి.

కోదం—ఇవ్వను. అవ్వి నాకూ కావాలి.

మాధ—నాకూ. నా భవిష్యత్తుకు అవి కావాలి. వాటితో నేనో ఉపాధి కల్పించుకోవాలి. నీకు తెలుసు - అవ్వి తప్ప నాకు ఆధారం లేదు.

కోదం—అవ్వే నాకూ ఆధారం. వేరే నాకూ ఏంలేదు.

మాధ—నీకాధారం నేనున్నా. నాకు తిండి వుండగా నీకు లోటు చెయ్యను.

కోదం—ఏమొ ! నాకా నమ్మక్కంలేదు.

మాధ—నన్ను నమ్మవా ?

కోదం—ఎందుకు నమ్మాలి ?

మాధ—నమ్మకపోయినా సరే - అవి యిల్లా యియ్యి. వాటిని నే నొదులుకో లేను.

కన—ఏమిటే గోల ?

మాధ—నువ్వాగు. ఇది యిప్పుడే తేల్చుకోవాలి. వేరేమన్నా వుంటే వీటికి పాల్పడేవాడినికాదు. ఈ దౌర్భాగ్యపు స్థితిలో అవి తప్ప గతిలేదు. నా ముందు జీవితానికి వీటితో, శ్యామలతో పునాది వేసుకోవాలి.

కన—ఏమిటి - శ్యామలతోనా - ?

మాధ—ఆ - శ్యామలతో - యిప్పుడే వస్తుంది.

కన—ఇక్కడికి కొస్తుందా?

మాధ—ఆ. ఇక్కడికే వస్తుంది. వాళ్ళమ్మా నాన్నా వప్పుకోకపోయినా వస్తుంది. ఎవ్వర్నీ లెక్క చేయకుండా వస్తుంది. మా యిద్దరి భావిజీవితాలకూ ఎవరడ్డం వచ్చినా లెక్క చెయ్యం. నా సుఖానికి ఏం చెయ్యాల్సి వచ్చినా చేస్తాను.

కన—ఏమిట్రాది. (అంటూ అడ్డం వెళ్ళగా మాధవం అతన్ని తోసేస్తూ)

మాధ—నువ్వూరుకో (కోదండంతో) నిశ్చయించుకో - ఏది యిష్టమో!

రాజ్యం—ఆగన్నయ్యా!

మాధ—నువ్వూరుకో రాజ్యం!

రాజ్యం—నువ్వేం చేస్తున్నావో ఆలోచించుకోరా - పక్క సారి. (శ్యామల గోడమీాదనుంచి చూస్తుంటుంది)

మాధ—ఆలోచించక్కర్లేదు, నా జీవితాన్ని నాశనం చేసిన వేరు పురుగుల్ని చంపేస్తున్నాను. తప్పుకో నువ్వు - నాకెవ్వరడ్డం వచ్చినా పేలిపోతారు - నువ్వైనా కనక మైనా సరే.

కన—నీకు నిజంగా పిచ్చెక్కింది.

మాధ—ఆ, పిచ్చెక్కింది. కాని ఎవరు...ఎవరు ఈపిచ్చికి కారణం? ఎవ్వరు నాసుఖాన్ని దోచుకున్నవాళ్ళు? ఎవరు- నాఅభివృద్ధికి ఆటంకమైనవాళ్ళు? - తప్పుకోగల్గినవాళ్లు తప్పుకోండి - చావదలచినవాళ్ళు చావండి.

(ముందుకువస్తున్న మాధవాన్నిచూసి రాజ్యం గబ గబా వెళ్ళి కోదండానికి అడ్డం నిలుచుంటుంది. కనకం మాధ వాన్ని పట్టుకోబోతాడు. మాధవం వదిలించుకుంటూ)

తప్పుకో రాజ్యం! - చెపుతున్నా తప్పుకో - తప్పుకో తొం దరగా-లేకపోతే గుండు యిద్దరిగుండెల్ని చీల్చి దూసుకు పోతుంది - తప్పుకో.

కోదం—రాజ్యం! - తప్పుకో (రాజ్యాన్ని ప్రక్కకుతోస్తూ) రాజ్యం తప్పుకోకపోతే యిద్దర్నీ పేల్చి చంపుతావు?-

చెల్లెలి నగలేకాకుండ చెల్లెలి ప్రాణాలుకూడ తీసుకుంటాన్. హుఁ! ఇదిగో నీకు కావల్సిన నగలు - ఈ నగలు తీసుకునేముందు యీ ప్రాణాల్ని తీసుకో - ఈప్రాణాల్ని తీసుకుంటే ఎక్కువగా సుఖపడతాన్. పేల్చు. నగలు తర్వాత తీసుకో.

మాధ—అంతవరకు వస్తే వదుల్తాననుకున్నావా? - ఇంతవరకు వచ్చింతరువాత ఆగుతాననుకున్నావా? కానియ్యి-యిదిగో (పేల్చబోగా)

కన—మాధవం! (శ్యామల గోడమీద కనిపిస్తుంది)

శ్యామ—(గోడమీదనుంచి) మాధవం! - ఆగు - నే నొస్తున్నాను.

మాధ—ఆగను. శ్యామలా నువ్వికక్కడికి రాకు.

శ్యామ—ఆగు - నేనొస్తున్నాను. (గోడదిగి వెనకగుండా వస్తుంది. కనకం మాధవాన్ని గట్టిగా పట్టుకున్నాడు. ఈ హడావుడిలో అశ్రద్ధగావున్న కోదండం చేతిలోంచి నగలమూటను రాజ్యం లాక్కొని మాధవందగ్గర కొచ్చి యిస్తుంది)

కోదం—రాజ్యం!

రాజ్యం—(యిస్తూ) ఇదిగో రా నీనగలు.

మాధ—నగలు - నగలు. ఇక మీరందరు యిల్లు విడిచిపొండి. నాకడ్డం రాకుండా వెళ్ళిపొండి.

(రాజ్యం కనకం గబగబా కోదండందగ్గర కెళ్ళి)

రాజ్యం—రానాన్నా, పోదాం రా.

కన—పోదాం పద మామయ్యా.

కోదం—ఎక్కడికి?

కన—మాయింటికి.

కోదం—రాను. ఇది నాయిల్లు - నాయింట్లో నే వుంటాను.

మాధ—మళ్ళీ మొదటికి రాకు. ఇల్లువిడిచి పొమ్మని మొదటే చెప్పాను. నేనింకా జంతువునై పోకుండా వుండాలంటే నన్ను, యీయింటిని వదిలి వెళ్ళిపో - (లోపలికొచ్చిన శ్యామల మాధవాన్ని చూస్తూ నిస్తబ్ధురాలై నిలిచి పోతుంది.)

కోదం—వెళ్ళను - వెళ్ళటానికి వుండలేదు. చావటానికే వున్నాను.

కన—పదమామయ్యా. ఇప్పుడు వాదించి లాభం లేదు. వాణ్ణి మనమే పశువునిచేశాం. కాస్సేపుంటే మళ్ళీ వాడే మనిషవుతాడు.

రాజ్యం—రానాన్నా. అంతా తర్వాత ఆలోచిద్దాం.

కోదం—కాదు - చంపనీ - పేల్చిచంపనీ - పోవటంకంటే చావటమే మంచిది.

(కనకం, రాజ్యం కోదండాన్ని యింట్లోకి లాక్కునిపోతూ)

రాజ్యం—పదనాన్నా కచ్చలతో ఎవరు ఎవర్ని సాధించ గలరు. మాయింట్లో నాతో వుందువుగాని రా.

కన—పద మామయ్యా!

కోదం—రాను- నన్ను వదలండి. కొడుకు చేతుల్లో నే చచ్చే పుణ్యం మీరుకట్టుకోండి. నన్ను వదలండి.

కన—నువ్వా మూర్ఖంగా ప్రవర్తిస్తే ఎట్లా? - రా.

(ఇద్దరూ కోదండాన్ని లాక్కుని తీసుకుపోతారు)

మాధ—వెళ్ళారు. వెళ్ళారు. వెళ్ళిపోయారు. నిజంగా నేను రాక్షసిగా మారిపోకముందరే వెళ్ళారు. శ్యామలా! ఇక రా. నాభాగ్యం నువ్వు - నీకుతోడు యీభాగ్యం - రా- శోషించిన యీ మనస్సులో సౌఖ్యబీజాల్ని వెదజల్లు. అమృతంవర్షించి శ్యామలాల చిగిరించి రాజనాలు పడించు. కమలిపోయిన గుండెలు చల్లబడటానికి మాటలతో మాధుర్యాల నొలికించు, మాట్లాడు. మాట్లాడి యీ గుండెమంటలు చల్లార్చు.

శ్యామ—(నిష్ఠురంగా) ఏం మాట్లాడమంటావ్?

మాధ—ఏదైనా సరే. ముందుయీ ఆవేదన చల్లార్చు. అబ్బ, ఒక కఠినమైన పని చెయ్యటం ఎంతకష్టం. ఒళ్లంతా దహించుకు పోతోంది. నువ్వే నాకు ప్రశాంతి చేకూర్చాలి. నీ సహజవాక్చాతురితో నన్ను చకితుణ్ణి చెయ్యి. నీ అసమాన విలాసాలకు పలుకులు కూర్చి నన్ను పులకింప చెయ్యి. ఒక్కసారి - ఒక్కసారి నీపలువరుస రుచిరాలు మెరిసేటట్లు ఆ మెరుపు మైదీగనై నేను మేఘమండలిమీద మోదము౦దేటట్లు వక్కసారి మాట్లాడు.

శ్యామ—ఇంకా ఏం మాట్లాడను ?

మాధ—ఏ మాటైనా సరే, నీ మాటే వక పాట. నీ పలుకే వక కావ్యం.

శ్యామ—ఆగు. నీ కోసం కోకిల గానాన్ని కల్పించి వినిపించటానికి నేనేం కవయిత్రిని గాను. మాధవం ! - నేనాశించిన ఆదర్శ పురుషుడివి కాదు నువ్వు. స్వార్థంతో తండ్రిని తరిమివేసి చెల్లెలి నగలు దోచుకున్న నీచుడివి. స్వార్థంతో నన్నూ, నా మనోధనాన్నీ, నా సౌందర్యాన్నీ, నా ఆభరణాల్ని కోరిన స్వార్థపరుడివి నువ్వు. నీ ఆనందానికీ నీ సుఖానికీ నీ ధనంలాగ నన్నూ వక సాధనాన్ని చెయ్యాలని చూస్తున్నావ్.

మాధ—నిజమే. శ్యామలా! ఈ పరిస్థితులు నన్నిట్లా మార్చివేశాయి.

శ్యామ—ఏ పరిస్థితులు ? పరిస్థితులతో మారిపోయేవాడు పరమపురుషుడవుతాడా ? సామాన్య పరిస్థితుల్లో ఆదర్శాలకు జేజేలు చాచావు. అన్ని ఆదర్శాలు మాట్లాడావు. ఒక్కదాన్నిగూడ నిల్పుకోలేకపోయ్యావ్. సామాన్య పరిస్థితుల్లోనూ, భాగ్యశాలివైనప్పుడూ చెల్లెలి మీద ఎంతో ప్రేమ కనపరచావు. తండ్రిని గౌరవించావ్. నేను స్వార్థాన్ని బోధించినా త్రోసిపుచ్చావ్. కష్టాలొచ్చేటప్పటికి అన్ని ఆదర్శాలు విడనాడావు. కాని యీనాటిదే అసలు పరీక్ష. ఈ నాటిదే నీ నిజరూపం. నీ నిజరూపం తెలుసుకున్నాను. ఇక నే వెళ్తున్నాను..

మాధ—వెళ్తున్నావా ? నన్ను విడనాడి వెళ్తున్నావా!

శ్యామ—ఆ. వెళుతున్నాను.

మాధ—ఆలోచించు శ్యామలా! నీ కోసం యింత త్యాగం చేశాను.

శ్యామ—నా కోసం కాదు. నువ్వు త్యాగమంటున్నదే నీ స్వార్థం. నాకోసం కాదు. నీ కోసమే నీ వాళ్ళను వెళ్ళగొట్టావ్. నే వెళ్తున్నాను.

మాధ—ఆగు శ్యామలా! నిన్నుకూడా వదులుకుని జీవితాన్ని నరకం చేసుకోలేను.

శ్యామ—నే వెళ్తున్నాను. (బయటికి వెళ్ళిపోతూఅంటుం

మాధ—నా ఆశల్ని భగ్నం చెయ్యకు.

శ్యామ—నే వెళ్తున్నాను.

మాధ—ఆశలు నిరాశలైతే సాహసానికి దోవతీస్తాయి.

శ్యామ—నే వెళుతున్నాను.

మాధ—ఆగు శ్యామలా! (తుపాకి తీస్తాడు)

శ్యామ—నే వెళ్తున్నాను.

మాధ—చెపుతున్నా – ఆగు శ్యామలా – ఆగు – ఆగు శ్యామలా – శ్యామలా – శ్యామలా ఆగు –

(తుపాకితో పేలుస్తాడు. నిరాశగా వెనక్కివచ్చి క్రింద కూలిపోతాడు. నెమ్మదిగా తలెత్తి)

నాలో వున్న స్వార్థాన్ని ఖూనీ చేసేశాను.

(తల వాల్చేశాడు)

–: తెర :–



డా॥ కొర్రపాటి గంగాధరరావుగారు L. I. M.

జననం 10–5–1922. జన్మస్థలం మచిలీపట్టణం. విద్యాభ్యాసం ఏలూరు, మద్రాసులలో. బాపట్లలో వైద్యవృత్తిలో స్థిరనివాసం. తల్లి కీ. శే. లక్ష్మీనరసమ్మ. తండ్రి వెంకట క్రిష్టయ్యగారు.

చిన్నప్పటినుంచి నాటకాలలో సరదా. నాల్గవఫారం చదువుతుండగా పద్నాల్గవఏట మొదటిసారి "హతవిధి" అనే నాటకం రచించి తయారుచేసి స్టేజిమీద ఆడేరు. ఇప్పటికీ నాటకాలు వ్రాయడం వేయడంకొరకే. అభిమాన రచయిత "ఇబ్సన్"—'ఇప్పటివరకు నేను సాధించగలిగినది, తేలికగా ప్రదర్శించడానికి నాటకాలు వ్రాయడమే' అని వీరంటారు. చాలా నాటకాలు, నాటికలు వ్రాశారు. ఇంకా వ్రాస్తూన్నారు.

